# ఇందులోని కథలు.

—□—

(If you have tears, prepare to shed them now: Shakespeare.)

పద్మావతి నాకూతురుకాదు, నాబంధువులపిల్ల కూడాకాదు, నాస్నేహితుని కూతురు. నేను పెంచుకొను కూడాలేదు, ఆ పిల్లని. అయినా ఎప్పుడూ నేనూ, నాభార్యాకూడా దాన్ని మాపిల్ల అనే భావించుకున్నాముతప్ప పరాయిపిల్లని కలలో కూడా అనుకోలేదు. దాని తల్లిదండ్రులుకూడా తమరుకన్న బిడ్డయినా, అపిల్ల మాది అయినట్లు, తమకే ఎరువు అయినట్లు చూచుకొనేవారు.

ఈ భూమిమీదపడి మొదటిసారి తనవిశాల నేత్రములను తెరచి పురిటింటి నాలుగుగోడల మధ్యనున్న నూత్నప్రపంచమును నాలుగు మూలలా తెలియనితనముతో పరకాయించి చూచి, నామీద దృష్టి నిలిపినప్పుడు మాత్రము చిన్నినవ్వు నవ్వినట్లు తోచిందినాకు. ఆలోచనాంతరాళములందు లోకాంతర ప్రతిబింబములున్నట్లు తోచిందినాకు. ఆ చిన్న శరీరానికి దివ్యసౌరభములంటి ఉన్నాయనుకున్నాను.

ఆ సృష్టిసమయమందు, ప్రాణమునుంచి ప్రాణము బయలు వెడలునప్పుడు, కొంచెమించుమించుగా నాస్తికుడనైననేను, అవిశ్వాసముతో కూడుకొన్న పాశ్చాత్య విద్యావరణముచే కన్నులుమూతపడిన నేనుకూడా భయపడ్డాను. సృష్ట్యాదిని చూస్తున్నాననుకున్నాను. కొంతసేపటికి ఆ శిశువు నాలుగుమూలలా పరికించి నన్నుచూసి మందహాసము చేసినప్పుడు, నాఒడలు జలదరించింది. ఒకవింత ఆనందము తోచింది. ఈ అపరిచిత ప్రపంచములో ఆ గదిలో నేనొక్కడనే ఆ శిశువుకి పరిచితుడననిపించిది. ఎక్కడో, ఏ

లోకములోనో, ఎప్పుడో. ఆక్షణమునుంచే నాకు జన్మాంతర మందు, నమ్మకం, లోకాంతరములందు సంచరించే జీవు డొక్కడేనని, ఈ శరీరము నిమిత్తమాత్రమేననీ విశ్వాసము ఏర్పడ్డది. అప్పుడే మాశూన్యగృహమునూ, మాదంపతుల సంతప్తహృదయములనూ ఆనందపరచడానికి వచ్చిన దివ్య జ్యోతి ఈ పిల్ల అని భావించుకున్నాను.

ఆపిల్లతండ్రికి నాకూ మొట్టమొదట ఇంగ్లండులో పరిచ యము. నేను ఐ. యం. యస్. ప్యాసై, కొన్నాళ్లు ఉద్యో గములో ఉండి, Study leave పైన మళ్ళీ ఇంగ్లండు వెళ్ళాను. అప్పటికి నారాయణరావు I. C. S. చదువు తున్నాడు. చూచిన వేళావిశేషాన్నిబట్టి మాకిద్దరకూ గాఢ మైనమైత్రి ఏర్పడ్డది. అతనుబ్రతికి ఉన్నన్నాళ్ళూ నామాట కెప్పుడూ ఎదురుచెప్పలేదు. తండ్రిమాటేనా అంతభయభక్తు లతో పాటించాడో లేదో అనుమానమే. అతనిపరీక్ష, నాచదువూ అయిపోయి, ఇద్దరమూ స్వదేశము ఒక్కసారే చేరుకున్నాము. తరువాత అతను వివాహము చేసుకొన్నాడు. ఇంకోనాలుగు సంవత్సరములపిమ్మట మా పద్మావతిపుట్టింది. పురిటిముందు నారాయణరావుభార్యకు చాలాజబ్బుచేసింది. జీవించదని అంతా అనుకున్నారు. రెండుప్రాణాలలోనూ ఒకటేనా దక్కదేమో ననేస్థితిలో, నన్నురమ్మని టెలిగ్రాం వచ్చింది. నాకూపిల్లలులేరు. నేను అప్పుడు మధురలో ఉండేవాడిని. అతను బరంపురంలో ఉండేవాడు. నేనూ, నాభార్యాకూడా పరుగెత్తాము. అక్కడ డాక్టరుతోమాట్లాడి, కేసుబ్రహ్మాండం మీద నాచేతులోకి తీసుకొని, నెలరోజులు యమునితో యుద్ధముచేసి నాస్నేహితుని భార్యను బ్రతికించాను. పురిటికి కూడా నేనేదగ్గర ఉన్నాను.

క్రమేణా తంటాలుపడి మేమిద్దరమూ ఒక ఊళ్ళోనే ఉండే ఏర్పాటు చేయించుకొన్నాము. ఇందులో ఎవరికీ మార్పు అయినా రెండోవాళ్ళుకూడా నానా తంటాలూ పడి మార్పించుకొనేవాళ్ళు.

పద్మ ఎప్పుడూ మాయింట్లోనే ఉండేది. దాని ఆటలూ, పాటలూ, ముద్దులూ, ముచ్చటలూ చెప్పనలవికాదు. అవి తలుచుకొంటూనే ఈవ్యర్థ జీవితము గడుపుకొంటున్నాను. ఈ నా ఆఖరురోజులలో ఆ స్మరణమే, ఆ సంకీర్తనమే నాకు భగవన్నామస్మరణా, సంకీర్తనాను. మధుర, బృందావనము యమునాతీరారణ్యములూ, గోకులము, చూచినప్పుడు వైష్ణవ భక్తులకెట్టి ఆనందము కలుగుతుందో, నాతల్లి తిరిగిన చోట్లు, కూచున్నకుర్చీలు, అవీ చూస్తే నాకూ అట్టి ఆనందమే కలుగుతుంది. ఆమెవల్లనే నాలో ఉండే నాస్తికతపోయి ఆస్తికతఏర్పడ్డది. ఆపిల్ల తనుకాంతిచూస్తే తప్తకాంచన శబ్దముయొక్క భావం తెలుస్తుంది. ఆమె మాటలూ ఆటలూ, విని, చూచినతరువాతనే, 'శారికాకీరపంక్తికి చదువు చెప్ప, బర్హిసంఘములకు మురిపములుగరపు, మదమరాళంబులకు జూపు మందగతులు'—అనే పంక్తులభావము పూర్తిగాద్యోతకమైనది. నే పెంచినపిల్ల అనే అభిమానముచేత అతిశయోక్తి చెపుతున్నాననుకోవద్దు. అన్ని కాలములందూ, అన్ని దేశములందూ కవులకు, గాయకులకు, శిల్పులకు, చిత్రకారులకు స్వప్నములందు, భావములందు, కనిపించుచున్న దివ్యసౌందర్య మూర్తియొక్క మూర్తి నా పద్మ. ఇంకనేమి చెప్పగలను? నాతల్లికి పదిసంవత్సరములు పూర్తిగానిండకుండానే, నారాయణరావు, హఠాత్తుగా ఇన్ఫ్లూయంజావచ్చి చనిపోయాడు. దానితో మాకు వియోగము ఏర్ప

ష్టది. నారాయణరావు భార్య పిల్లలను తీసుకొని వాళ్ళ స్వగ్రామం చేరింది. పిల్ల చదువుకోనమేనా నాదగ్గర ఉంచమన్నాను. 'అన్నయ్యా నేనుమట్టుకు ఇంకను ఏమిచూసుకొని బ్రతకను. అదికూడా కాస్త ఇంట్లో లేకపోతే తక్కిన వాళ్ళిద్దరూ, బొత్తిగా పసికూనలాయిరి, ఎలాగడుస్తుంది' అని విచారించింది. నేను ఏమీ సమాధానము చెప్పలేక రుద్ధకంఠంతో, అశ్రుపూరిత నయనాలతో నాతల్లిని ముద్దాడి పంపించేశాను. తరువాత అప్పుడప్పుడు శలవులలో వస్తూవుండేది మాయింటికి. నెలా, రెండునెలలూ ఉండిపోతూండేది.

ఇట్లా రెండు సంవత్సరాలు గడిచాయి. పద్మకు పండ్రెడవ సంవత్సరము జరుగుతోంది. త్వరగా వివాహము చెయ్యమని అయినవాళ్ళూ, కానివాళ్ళూ కూడా తొందరచేశారు. తల్లి తన భర్త బాగుండగా రజస్వలానంతర వివాహాలు చాలా మంచివనీ, అతిబాల్యవివాహాలు చాలా దూష్యములనీ అనేక ఉపన్యాసాలిచ్చింది. అనేకమందిచేత తన అధికార బలిమిచేత వాళ్ళపిల్లలకు రజస్వలానంతర వివాహాలు చేయించింది. కాని స్వవిషయం వచ్చేనరికి నాకుమాత్రైజోలి నీకెందుకనలేక పోయింది,నలహాదార్లను.విద్యాధికులూ, బ్రాహ్మలూచేసే దౌర్జన్యాలు వేరొకళ్ళు చెయ్యలేరు చూసి చూసి. అన్నిటికీమతమో సంఘమో మనకుశరణు. ఆలోచిస్తే మట్టుకు మనిషియొక్క పిరికితనము తప్ప మరొకటికాదు. ఎక్కడో ఒక అగ్రహారీకుల పిల్లవానికిచ్చి ఫలానప్పుడు వివాహమని నాకు శుభ లేఖ వచ్చింది. అంతకుముంధు నాకేమీ కబురులేదు. దానితో నిర్ఘాంతపోయి.తిరుగు రైలులో వాళ్ళఊరు చేరుకున్నాను.

నారాయణరావుకు ఏకోదరులు ఎవ్వరూలేరుగాని ఒకవేలువిడిచిన అప్పగారు ఒకామె ఉండేది. చాలా తక్కువస్థితిలో

ఉండేవాళ్ళుపాపం. ఇతను చాలా సహాయంగా ఉండేవాడు. ఆమెకు ముగ్గురు కొడుకులు. సుందరం కడసారివాడు. ఈ పిల్లవాని మూడోయేట, తండ్రి, కృష్ణలోస్నానం చేస్తూం డగా ఆనకట్ట తలుపుమీదపడి, పోయారు. ఆవార్త వినితల్లి ఆత్మహత్య చేసుకుంది. పెద్ద కుర్రవాళ్ళిద్దరూ కాస్తజ్ఞానం వచ్చినవాళ్ళు. వాళ్ళకేదో తగు సహాయంచేసి సుందరాన్ని మట్టుకు తనదగ్గరపెట్టుకొని కొడుకుకంటె ఎక్కువగా పెంచాడు.

సుందరం నిజంగా సుందరమూర్తే. సౌందర్యానికి తగిన సుగుణసంపత్తి, ఉదారభావములు, మహదాశయములూను. ఏజమీందారీ కుటుంబములోనో పుట్టవలసిన వాడుకాని నిరు పేదబ్రాహ్మణ కుటుంబములో పుట్టవలసినవాడుకాడు. కవి త్వమూ, గానమూ అతనికి పుట్టుకతోటే వచ్చాయి. అతను మాట్లాడుతుంటేనే ఏదో పాటపాడు తున్నట్లుగా ఉండేది. ఆ మార్దవమూ, మాధుర్యమూ, సౌకుమార్యమూ చెప్పనలవి కాదులెండి. ఏడాబామీదనో నిలబడి ఏకోకిలపాట వింటూనో, ఏసూర్యోదయమో చూస్తూనో ఉంటే, అతనిచెవులకు లోకాతీ తమైన ధ్వనులు వినపడుతూ, కన్నులకు దివ్యదర్శనము లేవో అవుతూ ఉండేవనుకుంటాను. ఆసమయాల్లో అతన్ని చూస్తేమట్టుకు కుర్రవాడైనా, నిశ్చలసమాధిలోనున్న మహా యోగివలె ఉండేవాడు. చూచినమస్కరించబుద్ధి అయేది. మాపద్మకు కూడా, వానిధ్యానమే, వానిమాటలే, వానిభావ ములే. ఆకవిత్వమే, ఆగానమే అబ్బింది. విశేషించి నా తల్లికి చిత్రలేఖనముకూడా చక్కగా అబ్బింది. అతను నిద్రలో చూచివర్ణించిన స్వప్నములనూ, అతని మనోవీధిలో పరుగెత్తే భావములనూ, నాతల్లి చిత్రములలో బంధించేది.

కొన్నిరోజుల వరకూ వాళ్ళు ఆ పటములనుచూచి ఆనం దించుకునేవారు. ఈ రహస్యానందము వాళ్ళిద్దరి మధ్యనే. రెండోకంటివాళ్ళకు తెలిసేదికాదు వాళ్ళు ఏప్పుడూ చెప్పే వారుకారు. చెవుతేమట్టుకు ఇవన్నీ ఎవరికి అర్థం అవుతాయి. ఇదంతా, నా పద్మనన్నీ అగాధములో ముంచిపోయిన కొంత కాలమువరకూ నాకూతెలియలేదు. కాని, బ్రహ్మ ఎక్కడేనా ఒకమొగవానికోనము ఒక ఆడదాన్ని సృష్టిచేసి ఉంచాడూ అంటే, ఆ పిల్లవాడికోనం ఈ పిల్లను పుట్టించాడు అనుకునే వాళ్ళము. ఆటలలోనూ, పాటలలోనూ, మాటలలోనూ, వాళ్లిద్దరూ ఒక్కటే. భేదమనేమాట ఎప్పుడూలేదు. సృష్టిలో ఏ ఇద్దరూ ఇలా ఏకీభవించడము నేను కనివిని ఎరుగను. మీరేమైనా ఎరుగుదురేమో నాకుతెలియదు. వాళ్ళిద్దరిహృద యాలూ ఎప్పుడూ ఒక్కటిగానే స్పందిస్తూ ఉండేవనుకుం టాను. ఇద్దరి శ్వాసలూకూడా పరిశీలిస్తే ఒక్కమాదిరిగానే ఉండేవనుకుంటాను.

ఇంట్లో ఉన్న ఇలాంటి పిల్లవాడిని వదులుకొని ముక్కూ మొగమూ ఎరగని పరాయిసంబంధము కోసము పాకులాడే వాళ్ళు ఎక్కడేనా ఉంటారా? ముంజేతి మాణిక్యాన్ని వదలు కొని, మూలనున్న గులకరాతి కోనం వెతుక్కోడంలో అర్థ మేమైనా ఉన్నదా?

అనేక విధాల ఆవిడతోటి చెప్పాను; వాదించాను, కోప్ప డ్డాను, ఏమిచేస్తే ఏమిలాభము? ఆడవాళ్ళకు, అందులో ధన వంతులైన వితంతువులకు, వాళ్ళకు తోచినంతేకాని ఇంకొ కళ్ళు చెపుతే విన బుద్ధిపుట్టదు ఎంతసేవు చెప్పినా ఆవిడది ఒక్కటే పాట. 'ఈపిల్లవాడికి ఏమీలేదు. రెక్కలమీద ఆధార పడవలసిందేను! అవతల వాళ్ళకు బోలెడంతఉంది. నా

పిల్లకూ, పిల్ల పిల్లకూ ఏమీలోటు ఉండదు.' ఇదితప్ప వేరు మాటలేదు. ఏమిటిదానికి సమాధానము? డబ్బు ఎంతపని చేస్తోందో చూశారా! డబ్బు పాపహేతువనీ, దానివలన వచ్చే సౌఖ్యములన్నీ నిజంగా దుఃఖదాయకములనీ చెప్పగలిగిన వేదాంతమునకు పుట్టినిల్లయిన మనదేశములో, ధనసమార్జన యందాసక్తిలేకుండా, యాచన చేసుకుంటూ జీవయాత్ర గడపవలసిన బ్రాహ్మణకుటుంబములోపుట్టి అరుంధతీ అనసూయాది మహా పతివ్రతలను ఆదర్శముగా పెట్టుకున్న విద్యావతియైన ఒక బ్రాహ్మణస్త్రీ, ఇతరులు అస్తివంతులని ఇంట్లో సంబంధం మానుకున్నదంటే ఎంతదారుణము, ఎంత సిగ్గు! బ్రాహ్మణులలో జరిగే ప్రతివివాహములో కూడా డబ్బు దగ్గిరపేచీ లేనిది ఒక్కటేనా ఉందా! వేలంపాటపెట్టి, పోటీలు పెట్టి, కోడళ్ళను కొనుక్కొని తరువాత వాళ్ళను వేచుకుతినే ఈ బ్రహ్మరాక్షసులేకాదూ మనకు సనాతనధర్మ మార్గదర్శకులూ, ఉపదేష్టలూను.

పద్మను రహస్యంగా పిలిచి 'నువ్వు ఒప్పుకున్నావా అమ్మా' అని అడిగాను. తలవంచుకొని, వినపడీ వినపడకుండా 'ఏమి చెయ్యగలను' అంది. అని, ఒక్క క్షణము ఊరుకొని నామెడకు తన రెండు చేతులూ పెనవేసి ఒక్క మాటు కడుపు చెక్కలయ్యేటట్టు రాగాలెట్టి, 'మామా, నన్నెందుకు విడిచి పెట్టావునువ్వు? మీయింట్లో నన్ను ఉండనివ్వకపోయావా? పంపనని అమ్మతో దెబ్బలాడకపోయావా? నీకామాత్రం అధికారంలేదూ? నీకూ నామీద ఇంత దయలేకపోనా? ఇంతకూ నిన్ననవలసిన పనేముంది? పరమేశ్వరునికే నామీద కటాక్షము లేనప్పుడు నీకు లేకపోవడములో ఆశ్చర్యమేముంది? అని ఒక్క పరుగున అవతలకు పారిపోయింది.

ఆ అన్నమాటలూ, ఆ నిలబడ్డవైఖరీ, ఆ కళ్ళలో నిప్పులూ చూచి హడిలిపోయాను. నేను చచ్చినతరువాత యమధర్మ రాజేవన్నా ప్రశ్నలువేస్తే ఎంత భయపడేవాడినో ఇప్పుడూ అంత భయపడ్డాను. నిజంగా, ఆ ప్రశ్నలు వేసింది దేవుడేకాని ఆపిల్ల కాదనే ఇప్పటికీ నా నమ్మకము. వాటికేమి సమాధా నమున్నది? దోషినే, ముమ్మాటికీ దోషినే. ఈ దోషమంతా తల్లి దికాదు, నాదే. నామెడకు చుట్టిన చేతులు ఉరిత్రాళ్ళయి చంపినా బాగుండేది అనుకున్నాను. అలా ఎందుకు జరుగు తుంది? జీవచ్ఛవములా బ్రతికి ఈ పాపఫలమంతా అను భవించవద్దూ. నా పాపఫలము నేనుకాకపోతే ఇంకెవ్వరనుభ విస్తారు? ఈజన్మలోచేసినదానికి జన్మలోనే అనుభవము కావ డముకూడా మంచిదే! అందుకనే అనుభవిస్తున్నాను.

నేను పిల్లనెత్తుకుపోయి మాట్లాడకుండా సుందరానికిచ్చి పెళ్ళి చేద్దామా అనుకున్నాను. అలాచేసినా బాగుండేదేమో కాని నాకుధైర్యం చాలకపోయింది. నాకేమి అధికారము న్నది? ఆ పిల్లపై నాకున్న అవ్యాజానురాగం తప్ప మరేమీ లేదు. అందుచేత యీపని చేశానంటే కోర్టువారంగీకరిం చరు. చదువుకున్న సన్యాసికున్నంత పిరికితనం మరెవ్వరికీ ఉండదనుకుంటాను. ఆ ప్రయత్నము విరమించకుని నా ఉద్యోగానికి నేను పోయాను. పెళ్ళికి నేనువెళ్ళలేదు. నాభార్యను మట్టుకు పంపించాను. మామూలు తగువుల తోటీ బిగువులతోటీ అయిదురోజులూ అలాఅలా జరిగాయి.

యౌవనాంకురమైన తరురువాత మాపద్మ సౌందర్యము వర్ణించడానికి నాబోటివానికి సాధ్యముకాదు. ఆమె ఎదుట నిలబడితే పెద్దమెరుపు మెరుస్తే కన్నుచెదిరిపోయినట్లుండేది. ఎవరైనాసరే అపిల్ల ఎదుట నిశ్చేష్టులై శిలావిగ్రహాల్లా అలా

నిలబడిపోవలసినదే. ఆసౌందర్యానికితగ్గ సుగుణసంపత్తి, విద్యాభిమానము, సంస్కృతాంధ్రములందొకపాటి పాండిత్యము, జన్మాంతర సముపార్జితమైన గానకళ, చిత్రలేఖనా నైపుణ్యము – అబ్బా; ఇటువంటిపిల్ల సృష్టిలో ఇంకొకతె ఎక్కడేనా ఉన్నదండీ!

భర్త అయిదవ ఫారము మూడేళ్లుతప్పి అంతటితో చదువు చాలించి ఇంటిదగ్గర కూచున్నాడు. చూడడానికి ఒకమోస్తరుగా బాగానే ఉంటాడు. కాని అంతే. మరేవిశేషము చూతామన్నా కంచుకాగడావేసి వెతికినా కనుపించదు. మామూలు అగ్రహారీకపులక్షణాలన్నీ ఇతనిలోనూ మూర్తీభవించినాయి. వంటరిగొట్టుతనం, ఇతరులనుచూస్తే అసహనం, విపరీతమైన అహంభావమూ, కామినీ కాంచన కాంక్ష కొంచెం జూదము – ఇంక ఆ సుగుణసంపత్తి ఎరుగని వారెవరు? నిత్యము, మన కళ్ళయెదుట, కోర్టులలోను, ఆసుపత్రుల లోను, ఈ జాతివారు ప్రత్యక్షమౌతూనే ఉంటారు. వారి వైఖరి చూడగానే అగ్రహారీకుడురా అని మూడుపంక్తులా ముఖాన్నివ్రాసి ఉంటుంది,

ఇందులో ఏ అంశములోనూ పద్మమొగుడు ఇంకొళ్ళకు తీసిపోడు. విశేషం, మాట్లాడితే పేచీ ఒకటి. పిల్లనుపుట్టింటికి పంపడానికి పేచీ, తీసుకురావడానికి పేచీ, దగ్గిరున్నప్పుడు ఇంక చిత్రవధే. వివరంగా వర్ణించడం ఎందుకు? డబ్బున్న దనుకొని అగ్రహారీకులకు పిల్లనిచ్చుకున్న ప్రతితండ్రికీ ఈ అనుభవము తెలిసినదే. తేడా ఏమీలేదు. అతిశయోక్తి అంతకంటేలేదు. ఒకసారి పండుగలకు వచ్చినప్పుడు నేను చూడ్డానికి వెళ్ళాను. నాతల్లని ఆనవాలు కట్టలేకపోయాను. అంత అలామారిపోయింది. ముఖంలో ఎప్పుడూ తాండవిస్తూ

ఉండే మందహాసముగాని, కళకాంతులుగాని ఎక్కడాలేవు. భోజనందగ్గిరైనా ఎప్పుడూ పుస్తకం విడువనిది పుస్తకమన్న మాటముట్టుకోడంమానేసింది. సంగీతమూ, చిత్రలేఖనమూ సంగతి చెప్పనే అక్కరలేదు. పిల్లచూస్తే సగమైపోయింది.

ఒకరోజు సాయంకాలము దగ్గరకూర్చోపెట్టుకొని ఆమాటా, యీమాటాచెప్పి 'ఏమమ్మా ఇలా అయిపోయావు? ఓచదువు లేదు, సంగీతములేదు, మాటలేదు, మంతిలేదు, ఏమీలేదు. నాతోటి చెప్పవుతల్లీ,' అన్నాను. ఒక్కక్షణం అట్టే ఆకాశం లోకిచూస్తూ ఊరుకుంది. అశ్రువులతో నిండిన రెండుకళ్లూ నక్షత్రకాంతిని ప్రతిఫలిస్తున్నాయి. 'ఏముందిమామా! చెప్ప డానికి? అగ్రహారపు కోడళ్ళ అవస్థలు నీకు తెలియవు గనుకనా! అనుక్షణం అన్నిటికీ రంపపుకోతే. కూచుంటే తప్పు, నుంచుంటేతప్పు. శుభ్రమైనబట్ట కట్టుకుంటేతప్పు, కొత్తవస్తువు పెట్టుకుంటేతప్పు. ఇంకెలాబతకడము? ఆమహ రాజుకు ఏమీ అక్కరలేదు. ఎక్కడెక్కడో తిరిగి ఏరెండో జామువేళో, మూడో జామువేళో వస్తారు. ఆయనకేమి, మగవాడు. నోరెత్తడానికి వీలులేదు. పగలెప్పుడైనా ఇంటి దగ్గరుంటే నన్నూ నాతల్లినీ దూషించడముతో సరిపోతుంది. ఇంకనాకు చదువెందుకు, సంగీతమెందుకు? ఎవరుచూచి ఆనందించను? ఆయింట్లో ఎవ్వరికీలేనప్పుడు నాకుమట్టుకు దానివల్లకలిగే ఆనందమేముంటుంది? ఇక్కడంటే సుందరం బావ—' అని ఇంక మాట్లాడలేకపోయింది. ప్రతి అక్షరమూ దాని హృదయములోనుంచి చీల్చుకొచ్చింది. ఆహా! ఆపిల్ల ఎంత బాధపడుతున్నది – అన్నికష్టాలూ ఈపిల్లకే రావాలా? అన్నీచూస్తూ ఇలా ఊరుకోవలసినదేనా – అని చాలావిచారిం చాను. ఏమిచెయ్యగలను.

మా పద్మకి పదహారేళ్ళు పూర్తిగా నిండలేదు. నేను వేలూరులో ఉన్నాను. హఠాత్తుగా ఒకనాడు సాయంకాలము పద్మకు ప్రాణం మీదికొచ్చిందనీ, నాకోసం బెంగపట్టుకున్నదనీ, వెంటనే రమ్మనీ, పిడుగులా టెలిగ్రాంవచ్చింది. జబ్బుగాఉన్నట్లు ఉత్తరమేనాలేదు. ఏమిరా భగవంతుడా అని నేనూ, నాభార్యాకూడా వెంటనే బయలుదేరి వెళ్ళాము. పిల్ల అసుపత్రిలో ఉందన్నారు.

పిల్ల శల్యావశిష్టముగా ఉన్నది. ప్రాణం అంతా కళ్ళలో ఉంది. సంధికూడా ప్రవేశించింది. కళ్ళురెండూ జ్యోతుల్లా వెలుగుతున్నాయి. మొదట నన్ను గుర్తించలేదు. చూపు ఈ లోకముమీదలేదు. నాడు పుట్టినరోజున చూచినట్లుగానే నూతన ప్రపంచాన్ని పరీక్ష చేస్తున్నట్లుగా గదినాలుగుమూలలా చూస్తూ నాకేసిచూచి ఒక్కసారి దృష్టి నామీదనిలిపింది. నన్ను గుర్తించుకుంది. ముఖంలోకి ఏక్కడలేని అనందం వచ్చింది. నన్ను దగ్గిర కూర్చోమని సంజ్ఞచేసింది. కూర్చున్నాను. ఒకచేత్తో నా చెయ్యిపట్టుకుని రెండవచేత్తో నా ముఖమంతా తడుముతూ "అమ్మయ్యా, వచ్చావు మామా, ఇంక ఫరవాలేదన్నమాటే. ఇంకనే బతుకుతానుకాదు మామా, నన్ను బతికిస్తావుకాదూ. ఇన్నాళ్ళనుంచీ ఎందుకు రాలేదయ్యా! ప్రాణంపోతూవుంటే కూడా కాస్త చూచిపోకూడదా" అంది.

బల్లిలా మంచాన్ని అంటిపెట్టుకున్న ఆ అకారము, గర్భనిర్భేదమైన ఆ మాటలుచూచి, వినేసరికి నాకడుపు తరుక్కుపోయింది. ఎక్కడలేని దుఃఖమూవచ్చింది. నాజన్మలో మొదటిసారి, చిన్నపిల్లవానికి మల్లేఏడ్చాను. నాతల్లి కళ్ళుకూడా నిండినాయి. అయినా తన దుఃఖాన్ని అపుకొని పెద్దదానికి

మళ్లీ నన్నూరడించడము మొదలుపెట్టింది. వెంటనేవెళ్ళి అక్కడ దొరసానితో మా తల్లినంగతి మాట్లాడాను. ఏమిటి జబ్బన్నాను–మీరు మందేమిస్తున్నారు–ఇంతవరకూ ఎందుకు ముదరనిచ్చారు. అని గుక్కతిరగకుండా వందప్రశ్నలు వేశాను. ఇన్ని ప్రశ్నలు వినగానే ఆమెకు కోపమువచ్చింది. కాని, నేను ఫలానాఅని చెప్పగానే నాతో సావధానముగా మాట్లాడింది. మాట్లాడడానికేముంది? వ్యాధి ·ఏమో తెలి యదు. కారణమంతకంటే తెలియదు. ఏ పరీక్షకూ, ఏ మందుకూ లొంగలేదు. మే మే మీ లోటు చెయ్యలేదు పిల్ల ఇంకొక్క రోజుకంటే ఎక్కువ జీవించదు. కాని ఆలోచిం చగా నాకొక్కటి తోస్తుంది. ఆపిల్లజబ్బు శరీరసంబంధమై నదికాదు. మానసికమనితోస్తుంది. దుర్భరమైన మనోవ్యథ ఏదో ఈపిల్లను కుంగదీసి, గుండెపాడుచేసి ఒక విధమైన క్షయవ్యాధిలోకి దింపింది. ఇంత చిన్నపిల్లకంత మనోవ్యధ ఉండడానికీ తగ్గ కారణము కనిపించదు. తల్లినడుగుతే అటువంటిదేమీ లేదంది ఆమె: అయినా మీరుకూడా యోచించండి'' అన్నది దొరసాని. యోచనకేమున్నది? దొర సాని ఊహించినదే వాస్తవం. పిల్ల శరీరములో జబ్బేమీలేదు. ఏ విధమైన దోషమూలేదు. నవవికసిత పుష్పములో మాలిన్య మేముంటుంది? ఆమెవ్యాధి మానసికం. కన్నతల్లికూడా కని పెట్టలేకపోయింది.

తనకు అవసానము సమీపించినదని పద్మకూడా తెలుసు కొంది. మధ్యాహ్నము నన్ను దగ్గర కూర్చోపెట్టుకుని పూస గుచ్చినట్లంతా చెప్పింది. వాళ్ళు తన్నిపెట్టిన బాధలు, అన్న మాటలు, చేసిన అవమానాలు,—అఖరకు భర్తకూడా అను క్షణమూ అవమానించడమే. దానితో ఆపిల్ల గుండెబద్దలై బెంగ

పెట్టుకొని మంచము పట్టింది. ఇదంతా ప్రపంచానికేమి తెలుస్తుంది? ప్రపంచందాకా ఎందుకు? కన్నతల్లికి తెలిసి ఏడిసింది కనకనా! మాటలు ప్రాణాలు తీస్తాయా అంటారు. అనుభవించేవాళ్ళకు కానితెలియదు. కత్తితో పొడుస్తే నాలు గురోజుల్లో పుండు మానుకొస్తుంది. మాటతో పొడుస్తే ఆ జన్మాంతమది భాధిస్తోనే ఉంటుంది. పైగా, పద్మ మామూలు పిల్లకాదు. అతి సున్నితమైన మనస్సు దానిది. ఈ లోకపుపిల్ల కాదది. ఆ అతిలోకసౌందర్యముతోపాటు దాని గుణములన్నీ కూడా లోకాతీతములే. దాని ఆటలు, పాటలు, భావములు, ఆదర్శములు, ఆనందములు– అన్నీ లోకాతీతములే. అదె వ్వరూ, కనిపెట్టలేకపోయారు. శరత్కాలంలో సాయంసం ధ్యయందు. ఆకాశంలో చిత్రితమైన రంగులుచూస్తే కొన్ని రోజులవరకూ దానికి తిండికూడా అక్కరలేకపోయేది. ఒక చక్కని పువ్వుచూస్తే చాలు, ఒక మంచిమాటవింటే చాలు, ఒక ఇంపైన మూర్తిచూస్తే చాలు, ఒళ్ళు మరిచి పోయేది. ఈ లోకంలోపడి మానవాకృతి దాల్చి ఈమురి కిలో తిరుగుతున్నా, ఈమాలిన్యమేమీ దానికంటలేదు. దాని ఊహలూ, చూపులూ, ఏలోకములోనో సంచరిస్తూ ఉం డేవి. మన అందరివలె జన్మాంతరవాసనలను పూర్తిగా వద లలేక పోయింది ఆపిల్ల. ప్రయాణమధ్యమందాజీవుడు ఇక్కడ ఒక్క క్షణం విశ్రమించాడన్నమాటే కాని దృష్టి అంతా ముందు ప్రయాణముమీదనే ఉండిపోయింది. శరీర సుఖములనేవి శాశ్వతములుకావనీ, బ్రహ్మానందమే శాశ్వత మనీ, అదీ, కేవలము జ్ఞానలబ్ధమనీ మనకు ప్రతీమున లమ్మా చెపుతుంది. కాని ఎవరేనా శరీరసౌఖ్యం వదులుకొని, ఎప్పుడూ మానసికానందమే అనుభవిస్తున్నవాళ్ళను చూచి

మనము అర్థము చేసుకోలేము నరిగదా, పిచ్చిముండావా ళ్ళని, విశాఖపట్నమో, మద్రాసో, పంపేఏర్పాటు చేస్తాము.

పద్మకు పెళ్ళిచెయ్యక తప్పదనుకున్ననాడు సుందరాని కిచ్చి చేస్తే తీరిపోయేది. లేదూ, పెళ్ళివద్దు, పెటాకులూవద్దు మాట్లాడక ఊరుకొని దానిపుస్తకాలతో, దాని సంగీతంతో దాన్ని విడిచినా బాగుండేది. ఏదీలేకుండా, తెలిసో తెలియకో, తల్లి చేతులారా పిల్లను హంతకుల చేతిలో పెట్టింది. వాళ్ళు నిర్ద యంగా మూడు సంవత్సరాల్లో పిల్లను వధించారు. ఇది కోర్టులో రుజువు కాకపోవచ్చును. ముమ్మాటికీ ఇది హత్య కాని వేరొకటి కాదు. 'నేను ఆయనతో ఏ శరీరసౌఖ్యమూ కోరలేదు! మామా, దైవసాక్షిగా నాకక్కరలేదుకూడాను. నాభావనా ప్రపంచములో నన్నెందుకు తిరగనివ్వకూడదు మామా! దానివల్ల వాళ్ళకేమిలోటు?' అన్నది నా తల్లి. చిన్న పిల్లలు వాళ్ళకేమి తెలుసుననుకుంటాము. వాళ్ళకేమితెలు సునో తెలుసుకునే తల్లి దండ్రులెంతమంది ఉన్నారు, మన వాళ్ళలో! ఆ సాయంకాలమే అస్తమిస్తున్న సూర్యుడితోపాటు. నా తల్లికూడా అస్తమించింది, పద్మముకుళించుకు పోయింది పళ్ళెరంలో హారతి కర్పూరంలా హరించిపోయింది.

నాచేతులతో ఈ పాడులోకములో ప్రవేశపెట్టాను. ఈ పాడు చేతులతో పరలోకానికి సాగనంపాను........

ఇంకనా ఉద్యోగమెందుకు, తగలెయ్యను! నాతల్లినిబ్రతి కించలేని వైద్యమెందుకు, మానుకున్నా. అన్నీ వదలుకు న్నాను. నాతల్లేనాకు పరమేశ్వరునియందు భక్తికుదిర్చింది. ఆయనపాదములనే నమ్ముకున్నాను, ఎప్పటికైనా నాతల్లిదగ్గి రికి తీసుకుపోడా అని. పగలంతా నాతల్లి కడసారి పలు కులు చెవులలో గంటలుకొట్టినట్లు మోగుతూ ఉంటాయి. రాత్రంతా శ్మశానజ్వాలలో నాతల్లిమొగము........ శివశివా....

'కలడందురు దీనులయెడ......
కలడు, కలండనెడువాడు కలడో లేడో' !

నేను మొట్టమొదట కుప్పడిని చూచింది ఒక వేసంగి నాటి మధ్యాహ్నము. అది వైశాఖమాసము. రోహిణికార్తి. మధ్యాహ్నము ఒంటిగంటప్పుడు ఎక్కడెక్కడో తిరిగి, కాళ్ళు మంటలెత్తి నెమ్మదిగా రాయపేట ఆసుపత్రి దగ్గరకు చేరుకున్నాను. ఇంకా ఒక మైలు నడవవలసి ఉంది. చెన్నపట్టణంలో తిండిలేకపోతే ఒకపూట ఉపవాసమన్నా ఉండవచ్చునుకాని, తిరగడానికి డబ్బులేకపోతే మహాఅవస్థ. నాకు ఎప్పుడూ దరిద్రమే కాని, ఆనాడు మరీ ఒక్క కానీకూడా దగ్గిరలేక, తిరగడంతప్పక మైలాపూరువెళ్ళాలని పట్నంనుంచి బయలుదేరి నడక అందుకుని, రాయపేట చేరేసరికి పెద్దల దర్శనం కావడం ప్రారంభించింది. రక్షాహీనమైన పాదం రోడ్డుమీద పెట్టేసరికి నసాళం అంటేది. అదీకాకుండా, ఎండకు కరిగిఉన్నతారు పాపకర్మలాపాదాన్ని పట్టుకుని వదలక పోవడం. ధనాభావముచేత అప్పుడప్పుడు కలిగే అవస్థకే ఇంత బాధపడుతుంటే, ఎప్పుడూ ఇన్ని బాధలూ అనుభవించవలసిన దరిద్రులెలా బ్రతుకగలుగుతున్నారనే ఆలోచన పోయింది. దారిద్ర్యం అనుభవిస్తేనే కాని దరిద్రుల అవస్థ పూర్తిగా ఎలా తెలుస్తుంది !

ఒక్క క్షణం అక్కడ చెట్టునీడను నిలబడి, మరి ముందుకు సాగుదామని నిశ్చయించుకున్నాను. అది ఆదివారం. ఆపైన మిట్టమధ్యాహ్నం. నీడనుకూడా 110 డిగ్రీలకు తక్కువకానివేడి. అందుచేత రోడ్డునిర్జనంగాఉంది. ఎక్కడా ఏ విధమైన వ్యాపారమూ లేకపోవడంచేత కొంత నిశ్శబ్దంగాకూడా ఉన్నది. ఒక్క ట్రాముకారుమట్టుకు, చాలా

అయిష్టంగా ఉన్నట్లు గణగణలాడుతూ నెమ్మదిగా పాకి పోతోంది. సృష్టి అంతాకూడా స్తంభించిపోయినట్లుగా ఉంది. బళ్ళస్టాండు దగ్గర గుర్రాలు కునికిపాట్లు పడుతున్నాయి. బళ్ళవాళ్ళు కొందరు అక్కడనే పడుకున్నారు. చెట్టుకింద మట్టుకు ఒక పదిమంది కూచున్నారు. వాళ్ళమధ్య ఒకడు కూర్చుని ఖులాసాగా కబుర్లు చెపుతున్నాడు. నేను దగ్గరకు చేరాను. ఈ ఎండా, ఈ చెమటా, ఈ తాపమూ అన్నీ మరిచి పోయి ఇంత నిర్విచారంగా కబుర్లు చెబుతున్నవాడినిచూస్తే నా కొక విధమైన ఈర్ష్య బయలుదేరింది. ఇంత బాధలోనూ అంత సుఖంగా ఎలా ఉండగలుగుతున్నాడా అ మనిషి అను కున్నాను. నేను దగ్గరకు వెళ్ళేసరికి వాడు పోలీసు సార్జెం టును అనుకరిస్తూ అతనికి మల్లేమాట్లాడుతూ, ఏవేవో అర వంలో చెపుతున్నాడు. నాకు బాగా అర్థంకాలేదు. వింటున్న వాళ్ళంతా చాలా సంతోషిస్తున్నారు. భాష అర్థం కాకపోయినా వాడి అనుకరణంలో నేర్పుచూస్తే నాకూ సంతోషంగానే ఉంది. కొంచెంసేపు అలాగే నిలబడ్డాను. సార్జంటు పార్టు అయినతరువాత సోల్జరు, ఇంకా ఎవర్నో Imitate చేస్తూ మధ్యమధ్య తమాషాగా కబుర్లు చెపుతూ కాలక్షేపం చేస్తు న్నాడు కుప్పడు. వాడు రిక్షాలాగేవాడనీ, వాడిపేరు కుప్పడనీ దరిమిలాను తెలుసుకున్నాను. కబుర్లమధ్యను ఒకసారి కన్నెత్తి నాకేసిచూసి, తెలుగువాడినని గ్రహించి, 'ఏమిసామీ, బండి కావలెనా' అన్నాడు. అక్కరలేదన్నాను. మళ్ళీ వాడి ధోరణిలో పడ్డాడు. కొంతసేపైన తరువాత నేనింకా అలాగే నిలబడడముచూచి, 'ఏమిసామీ సూస్తావు. ఏమో పేదవాడు. పని ఏమీలేదు. ఎదో కతలు చెప్తాను' అన్నాడు నవ్వుతూ. 'బాగుంది, కానియ్యి. నేనూ విందామనే నిలబడ్డాను. మంచి

నటకుడవు కావలసిన వాడవులా ఉన్నావు చూస్తేను. నెమ్మదిగా ఏ సినిమా కంపెనీలోనేనా చేరరాదా' అన్నాను. నేను వేళాకోళం చేస్తున్నాననుకున్నాడు. 'అఁహఁ అదంతా మన కెందుకుసామీ. ఏదో ఆండవన్, ఈమాదిరి ఉండూ అని రాసినాడు. అట్లా ఉండవలసిందీదానె సామీ. అదంతా మన ఇష్టమా' అన్నాడు. 'అవును నిజమే నీవు చెప్పింది' అని నా దారిని నేను పోయాను.

షూమూలు రిక్షావాలాముఖంకంటె విలక్షణమైన ముఖము తెలివిగల మందహాసంతో మిలమిలలాడే కళ్ళు, పాతిక సంవత్సరములు పడ్డపాటుతో కడ్డీబారిన కాయశరీరం, ఉంగరాలు చుట్టుకుపోయి కొత్తగా పెరిగిన నీగ్రోవెంట్రుకలు, శుభ్రమైన కాకీనిక్కరు, కాకీచొక్కా, హేటుతోను కుప్పడు రిక్షావాలాలందరికీ గురువు.

ఒక్కసారిచూస్తే మరుపురానిమొహం; అయిదారు భాషలలో అడ్డంకులేని వ్యవహారభాషాజ్ఞానానికి తోడు లండను పోలీసులనుకూడా అవమానపరుపజాలిన స్థానిక చరిత్రజ్ఞానము కుప్పడిది. ఎంత చిన్నవస్తువైనాసరే వూళ్ళో ఎక్కడ దొరుకుతుందో అడగడము తడవుగా చెప్తాడు. ఖుషీ కావలిస్తే పట్నంలో ఏయేజాతి ఆడవాళ్ళు (Professionals కానివ్వండి, Amateurs కానివ్వండి) ఎక్కడెక్కడున్నారో నిమిషంలో యాకరు పెట్టకలడు. ఇన్ని విశేషాలు వాడిలో ఉన్నా వాడి దగ్గర ఒక్క మరీ గొప్పవిశేషం ఏమిటంటే, డబ్బుదగ్గర తగాదాలేదు. మీరు ఎంతఇస్తే అంతా సంతోషించి పుచ్చుకుంటాడు. రహస్యంలోమాట ఇంకొకటి ఏమిటంటే, పట్నంలో ఉండే గొప్పఇళ్ళ Scandals అన్నీ వాడికి జిహ్వాగ్రాన్న ఉంటాయి. నెమ్మదిగా కదుపుతే, రహస్యంగా

అన్నీ చెప్పుతాడు.

ఇన్ని సుగుణాలు వాడిలో ఉండడముచేత పెద్దలంతా వాడిని Patronise చేసేవాళ్ళు. అందుచేత మామూలుబళ్ళకు మల్లే, మనిషికనబడగానే 'రిక్షాసామీ' అని వెనకపడేవాడు కాడు. నాకు మట్టుకు మొదటివాణ్ణి చూచినప్పటినుంచీ ఒక విధమైన అభిమానం ఏర్పడింది. నేనెప్పుడూ వాడిబండి ఎక్కకపోయినా, వాడికీ నేనంటే ఒక విధమైన గౌరవంగా ఉండేది. నా సంచారాల్లో తరచుకనపడుతూ ఉండేవాడు. వాడు నాకో సలాం కొట్టడం, నేనువాడి యోగక్షేమం విచారించడమూ మామూలై పోయింది.

ఒకరోజు ఉదయం సుమారు పదకొండుగంటలవేళ Mount Road లో కనబడ్డాడు. నేను Tram కోసం నిలపడ్డాను. కుప్పడు నెమ్మదిగా ఖాళీబండి లాక్కుని వస్తున్నాడు. నన్నుదూరాన్నుంచేచూసి, గబగబ నాదగ్గరకువచ్చి, సలాంచేసి, 'ఎక్కడసామీ, పోతావు' అన్నాడు. 'రాయపేట' అన్నాను. 'రాసామీ పోదాం, ఎప్పుడూ నా బండి ఎక్కనేలేదే' అన్నాడు. దగ్గరడబ్బులేదన్నాను. ప్రొద్దుటినుంచీ బోణీ కాలేదు. ట్రాంకుఇచ్చే అర్ధణా తనకిచ్చి బోణీ చెయ్యమని బలవంతపెట్టాడు. మొగమాటపడి రిక్షాలో ఎక్కాను. నెమ్మదిగా బాతాఖానీవేస్తూ రాయపేటచేర్చాడు. అనేక మందిని గురించి అనేక సంగతులు చెప్పాడు. రాజకీయవేత్తలు, పెద్ద ఉద్యోగస్థులు వ్యాపారస్థులు, సనాతనులు, సంస్కారులు, ఒకరకం ఏమిటి, అన్ని రకాలవారూ ఆ రిక్షాలో కూచుని, చీకటిపడ్డ తరవాత ముఖం చాటుచేసికుని, ఏయే ఇళ్ళకు వెళ్ళినదీ, తనకెంత ఇచ్చినదీ, ఆ ఇళ్ళలో వాళ్ళకెంత ఇచ్చినదీ, ఇంకా ఎన్నెన్నో సంగతులు చెప్పాడు. నేను

నిర్ఘాంతపోయాను. వాడు న్యాయస్థుడు కనక సరిపోయింది కాని, రెండుఅక్షరాలు వ్రాయడమేవచ్చి వీళ్ళగుట్టంతా బయట పెడతానని తలొక ఉత్తరంవ్రాసి పారేస్తే, వాడు లక్షాధికారి అయేవాడుకదా అనుకున్నాను.

'నీఇల్లు ఎక్కడ' అన్నాను. 'నేను పేదవాడుసామీ. నాకు ఇల్లెక్కడసామీ' అని రాయపేట ఆసుపత్రి సమీపంలోఉన్న బళ్ళస్టాండుపక్కన చింతచెట్టుకింద రెండు కుండలు, రెండు పొయ్యిలు, ఇంకా అటువంటి చిల్లరసామాన్లూ చూపించి అదే తన ఇల్లన్నాడు. రిక్షాలో పరువులువేసుకుని అక్కడనే పడుకుంటానన్నాడు. వర్షమువస్తే, పక్కనున్న బళ్ళ స్టాండులో పడుకుంటానన్నాడు. భార్యా, ఒకపిల్లవాడూకూడా ఉన్నారని చెప్పాడు. భార్యకూడా ఓపిక ఉన్నప్పుడు ఏదో కాస్త కూలిపనిచెయ్యడమో, సాయంకాలం వేరు శనగపప్పులు అమ్మడమో, లేదా, ఏవోపళ్ళు చవకరకం అమ్మడమోచేస్తూ రోజూ ఒక పావలో అర్ధో సంపాదిస్తుందని చెప్పాడు.

'మరి మీరిద్దరూ చెరోదారినీ పోతే, మీసామాను ఎలా' అన్నాను. 'సామీ, మాకుసామాను ఏమి ఉంటుంది? ఉన్న దేమో అక్కడనే పడేస్తాము. ఎవరికొక్కావాలి, మాకుండలూ, పొయ్యిలూ, డబ్బాలూను. ఏపూటవస్తువు ఆపూట తెచ్చు కునేవాళ్ళమే కాని ఏదీ ఒక్కసారి కొనుక్కుని నిలవ చేసుకో లేముకదా! బీదవాని సామానుజోలికి ఏదొంగారాడు. దొంగ న్నమాటేమిటి, దారేపోయే కుక్కకూడా దరికిరాదు. మాకేమి భయంసామీ' అన్నారు. 'అవును నిజమే. పేదవాడు పేద రికాన్ని గౌరవిస్తాడు. నోరూ బుద్ధీలేని జంతువులుకూడా పేదరికాన్ని గౌరవించి మిమ్మల్ని బాధింపవు. అహంకార పూరితులూ, ధనమదాంధులూ, తోటి మానవులు మట్టుకు

పేదరికమంటే సహించరు. లక్ష్యము చేయరు' అన్నాను. 'ఏమో సామి, వారిని అనేది దేనికి? అందవరు దయ ఉండ వలెకాని. అదిలేకపోతే ఎవరు ఏమిచేస్తారు?' అన్నాడు.

ఈ సంభాషణ జరిగి వారం రోజులవుతుంది, ఒకరోజు సాయంకాలము నేను తిరువళిక్కేణి నుంచి పట్నానికి బీచి రోడ్డున నడుస్తూవస్తున్నాను. సుమారు ఏడు గంటలవుతుంది. ఐనుపవంతెనదాటి పదిగజాలు వచ్చేసరికి అక్కడ ఒక సుమారు ఇరవైసంవత్సరాల ఆడపడుచు ఒక చంకను చిన్న ఖాళీగంపను పట్టుకుని, ఎదుటనున్న జంఖానాక్లబ్బుదీపాల వైపూ, వచ్చేపోయే మోటార్లవైపూ పరధ్యానంగా చూస్తూ వయ్యారంగా నిలిబడి ఉంది.

ఏవర్ణమో తెలుసుకోడానికి శక్యంకాని చెన్నపురి వీధులలో సామాన్యంగా కనబడే జాతిపడుచు, నిగనిగమెరిసే తను కాంతి, పిటపిటలాడుతున్న లేతయౌవన శరీరం, ఒకమో స్తరు కళకాంతులతో కలకలలాడే ముఖం, కొంచెంచినిగి పోయినా, చక్కగా కట్టబడిన జపాను అద్దకపుచీరా జాక ట్టూను, ఆధునికపద్ధతిని అమర్చబడి పూలతో అలంకరింప బడ్డ తలకట్టు, వెనుకవైపున వెన్నెట్లో మిలమిలలాడుతున్న సముద్రము, నీలాకాశానికి మౌక్తికప్రభలు కల్పించిన పూర్ణ చంద్రబింబము, ఎదుట, నింగినుంచి నేలకుజారిన నక్షత్రా లలాగ లెక్కలేని విద్యుద్దీపాలు, మధ్యను ఆనందం తాండ విస్తున్నముఖంతో నల్లముత్యంలామెరుస్తూ ఈ పేదపడుచు, అదంతా ఒక్కక్షణం ఒక్కపెద్ద చిత్తరువులా తోచింది. ఏజాతి అయితేనేమి, ఏవర్ణమైతేనేమి, వీటివల్ల సహజంగా శరీరచ్ఛాయకాని, రూపలావణ్యాదులుకాని ఆపిల్లలో ఏమాత్ర మైనా కొరతగా ఉంటే, ఆమెయౌవనమూ, ఆనందమూ,

సంతృప్తి ఆలోపాలను కప్పిపుచ్చాయి. ఒక యూరేషియను యువకుడు నెమ్మదిగా ఆమెముందునుంచి నడుస్తూ ఆమె ముఖంకేసిచూచాడు. ముందుకు నడుస్తున్నవాడు మళ్ళీ వెనక్కి మళ్ళీ ఆపిల్లముఖంకేసి తేరిపారిచూస్తూ నెమ్మదిగా నడిచాడు. అపిల్లఏమి ఆలోచిస్తోందో, ఎందుకో చిరునవ్వు నవ్వింది. ఆ యువకుడు తన్నుచూచి నవ్వుతోంది అను కుని ఆమెయెదటనే నిలబడి తనూనవ్వుతూ ఆమెను పలక రించాడు. ఆమెముఖంలో నవ్వుపోయి కోపంకనపడ్డది.

'Oh ! come on you are not angry dear' అన్నాడు ఆమెదగ్గరగావెళ్ళి. ఆమెకు కోపమెక్కువయింది. కొంచెం భయంకూడా కలిగింది. అతన్ని తిట్టడమారంభిం చింది. ఆయువకుడు, కొంచెంతాగికూడా ఉన్నాడేమో, ఇదంతా వేళాకోళమను కున్నాడు. ఆకోపావేశంలో ఉన్న అమ్మాయి, అతనికళ్ళకు మరీ అందంగా కనపడ్డది. 'My dear Helen or Joan of Arc, you are not afraid of me. Come on darling. Don't worry, it will be alright'. అని జేబులు గల గలలాడిస్తూ ఆమెచెయ్యి పట్టుకోబోయాడు. అనేకవేల శతా బ్దాలనుంచీ వస్తూన్న హిందూస్త్రీల శీలమంతా అపిల్లలో అక్షణమందు మూర్తీభవించింది. కళ్ళతో నిప్పులుకక్కుతూ, నోటితో శపిస్తూ, చంకనున్న గంప నేలకు జారవిడిచి, చెయ్యి చాచి రెప్పపాటులో ఛెళ్ళున ఒక్కలెంపకాయ తనబలంకొద్దీ ఆయువకుడి దవడమీద తగలనిచ్చింది. ఆదెబ్బకు గూబ గుయ్యిమని ఉంటుంది. ఒకటిరెండు దంతములు కూడా కదిలి ఉంటాయని అనుకున్నాను. ఈ వేడుకచూస్తున్న నాకు చాలా సంతోషం కలిగింది. అతను ఒకమాటు దవ డతడు

ముకొని, పాకంముదిరిందనుకొని 'You devil, I will teach you' అని అమాంతం అపిల్లనుగట్టిగా పట్టుకుని ముద్దెట్టుకోబోయాడు. పక్కనున్న చంటిపిల్లాడు ఏడవడ మారంభించాడు. దారేపోయేవాళ్ళు నవ్వుకుంటూ చక్కాపోయారు. నేనేమిచెయ్యడానికీ తోచలేదు. లోపలరక్తం ఉడికిపోయింది. పోయికలియబడి అయూరేషియన్ని నాలుగు తన్నుదామా అంటే, ఏమిగందరగోళం అవుతుందో. అది అటుండగా, నలుగురూ నాలుగురకాల వ్యాఖ్యానాలు చేస్తారు. ప్రతికార్యానికీ నిందారోపణచేసే స్వభావము మన వాళ్ళది. ఎలాగా అని ఒక్కక్షణం తటపటాయించాను.

ఇంతట్లోకే కుప్పడు ఎవరినో రిక్షాలో ఎక్కించుకొని గబగబాలాక్కొస్తూ దెబ్బలాట దూరాన్నించిచూచి కొంచెంవేగం తగ్గించాడు. దగ్గరకువచ్చి వాళ్ళకేసి చూచాడు. మరుక్షణంరిక్షావిడిచి 'ఇదో వస్తిని సార్' అని బండీలో మనిషికి క్షమాపణ చెప్పుకుని ఒక్క అంగలో దెబ్బలాడుతున్న వాళ్ళ దగ్గరకు ఉరికి, వెనుకనుంచి అయువకుడి కంఠంపట్టుకున్నాడు. దానితోవాడు కంగారుపడి అడమనిషిని విడిచిపెట్టాడు. రిక్షావాడు, కుప్పడు ఆ అడమనిషని పారిపొమ్మని అరవంలోచెప్పాడు. ఆ అమ్మాయి మళ్ళీతిరిగైనా చూడకుండా పరుగుచ్చుకుంది, పిల్లాడితోసహా.

ఇక్కడ వీళ్లిద్దరూ కలియబడ్డారు. మాకుప్పడి ధైర్యసాహసాలకిమెచ్చుకుని ఒళ్ళంతా కళ్ళుచేసుకుని ఆదెబ్బలాట చూస్తూ అలాగే నిలపడిపోయాను. ఇంతలోకే, చూస్తూ ఉండగానే, పెద్దగుంపు చుట్టూమూగారు. ఈ సందట్లో రిక్షాలో పెద్దమనిషి చల్లగాజారాడు. కుస్తీఘోరంగా జరుగుతోంది. మొత్తంమీద రిక్షావాడిదే పైచెయ్యిగా ఉంది. ఒక్కక్షణంలో

దొరగారు చిత్తయిపోదురు. ఇంతలోకే ఎక్కడనుంచి వచ్చా డో, యములాడిలాగ, ఒకపోలీసుజవాను చక్కావచ్చాడు. కుప్పడిని ముందురెండు చేతిబెత్తంతో తగలనిచ్చి దొరనివిడిచి పెట్టమన్నాడు. గత్యంతరంలేక, ఎంతో అయిష్టంతో దొరని విడిచిపెట్టాడు. దొరనిమ్మళంగా ఒళ్ళుదులుపుకుని, కాలరూ, టై సవరించుకొని రిక్షావాడు అనవసరంగా తన్ని Assault చేశాడని నేరంచెప్పాడు. ఈయన్ను స్టేషనుకువచ్చి రిపోర్టు ఇమ్మన్నాడు జవాను. తనురిక్షాలో కూచుని, దొరను పక్కన కూచోపెట్టుకుని, కుప్పడినిరిక్షాలాక్కుని Police station కు నడవమన్నాడు,

మరునాడు కుప్పడు రిమాండులో ఉండగా ఒకసారివెళ్లి చూచివచ్చాను. నేను చేసేది ఏమన్నా ఉంటేచేస్తానన్నాను. ఏమీ అక్కరలేదన్నాడు. ఆ మరునాడు మేజిస్ట్రేటుకోర్టులో విచారణ ప్రారంభమైంది. కోర్టువారే కుప్పడికి వకీలుని ఏర్పాటు చేశారు.

ఒక ఆడమనిషి దగ్గర కానికి వేరుశనగపప్పు కొన్నాననీ, చీకటిచాటున, కానీకి అర్ధరూపాయి ఇచ్చాననీ, వెంటనే నాలు గడుగులు వెళ్ళి ఆ తప్పు తెలుసుకుని వెనక్కువచ్చి, ఆ మని షిని అడిగితే, ఇవ్వకుండా తిట్టడం ప్రారంభించిందనీ, అందుకని తను ఆ మనిషిచెయ్యిపట్టుకుని డబ్బుకోసం నిర్బంధంచేస్తుండగా వెళ్తూండగా వెనుకనుంచి కుప్పడువచ్చి నిర్హేతుకంగా తన్ని కొట్టి అవమాన పరచాడనీ దొరగారు వాఙ్మూలం ఇచ్చారు. ఆ ఆడమనిషికోసం ఎంత వెతికినా ఎక్కడా దొరకలేదు. అందుకని కుప్పడిమీద మాత్రం Hurt Case బనాయించారు. విచారణలో కుప్పడిని అడి గారు 'కొట్టినమాట నిజమేనా' అని. 'చిత్తం' అన్నాడు.

'ఎందుకు కొట్టావు?' 'నేను రాకముందు ఏమిజరిగిందో నాకు తెలియదండి. నేను ఆదారిని వెడుతుండగా ఈ దొర గారు ఆపిల్లను గట్టిగా పట్టుకుని బలవంతాన ముద్దుపెట్టుకో బోతున్నారండి. అదిచూచినాకు కోపమువచ్చి, ఒళ్ళు తెలియ లేదండి. దగ్గరకువెడితే ఈయన తాగిఉన్నట్టుకూడా తెలుసు కుని, ఆమనిషిని విడిపించడానికి ఈయన్ను కొట్టవలసి వచ్చిందండి!'

'ఆడదానికి అవమానం జరుగుతుందని పౌరుషం వచ్చిందా?'

'చిత్తం'. కోర్టువారునవ్వి 'ఓహో, ఏమి మహానుభావు డండి' అన్నారు. అంతానవ్వారు.

'నీవు రిక్షా లాగుతూంటావుకదూ.'

'చిత్తం.'

'పగలేనా, రాత్రులుకూడానా'?

'రాత్రులుకూడానండీ.'

'రాత్రులు ఎక్కడికేనా బోగంవాళ్ళ ఇళ్ళకు ఎవరినేనా తీసుకు వెళుతూ ఉంటావా?'

'చిత్తం.'

'ఆడవాళ్ళ మానరక్షణంకోసం దెబ్బలాటకు దిగినవాడవు, అది నీకు తప్పుగా తోచలేదేమి?'

'అయ్యా, అది వాళ్ళవృత్తి. బండిలాగడం నావృత్తి. అక్కడికి వెళ్ళేవారు చాలాచదువుకున్నవారు, ధనవంతులు, తమబోటిప్లీడర్లు, జడ్జీలు, ఉద్యోగులు, అన్నిరకాలవారూ ఉన్నారండి. ఆ తప్పొప్పులు వారికంటె నాకెక్కువ ఎలా తెలుస్తాయండి. అదిపాపమైతే ఆ పాపపుణ్యములు అనుభ వించేది వారుకాని నేనుకాదండి. నాకు అపూట పొట్ట

న్యాయంగా ఎలా గడుపుకోనా అనేకాని తక్కినది నా కెందు కండి. బండిలో కూర్చున్నవారు ఎక్కడకు తీసుకు వెళ్ళ మంటే అక్కడకు వెళ్ళడమే నాపనండి.

ప్లీడరుగారు కొంచెము తెల్లబోయి అటువంటి ప్రశ్నలింక అడగకూడదనుకున్నారు.

'కేవలం అడమనిషిమీద దయేనా.......లేకపోతే.......అమనిషిని....నువ్వు....ఎరుగుదువా అంతకుముందు.'

'ఎరుగుదునండి.'

ప్లీడరుగారు ఒక్కసారి ఛాతీ పెద్దదిచేసి, 'ఓ అదానంగతి, అలా దారిలోకిరా?'

'చిత్తం, నేనెప్పుడూ దారితప్పలేదండి.'

'నోరుముయ్యి. పెంకె సమాధానాలు చెప్పావంటే ఖబడ్దార్'అని కోర్టువారు మందలించారు.

'అయితే నీకేమైనా చుట్టమా ఆ మనిషి ?'

'చిత్తం నా భార్య అండి'

అంతా ఒక్కమాటు నిర్ఘాంతపోయారు. ప్లీడరుగారు పెద్ద నవ్వునవ్వి,

'నీభార్యా, అలాగేమి, ఎంతకాలమయింది వివాహమయి?'

'నాలుగేళ్ళయిందండి'.

'నీయిల్లెక్కడ'

'మాకు ఇల్లేమిటండి. రాయపేట అసుపత్రిదగ్గర చెట్టు కింద ఉంటామండి.'

'నీవు ఆ మనిషిని పెళ్ళి చేసుకున్నట్లు ఋజువు చెయ్య గలవా?'

కుప్పడు తెల్లపోయాడు. నాలుగేళ్ళక్రితం ఎక్కడనో ఏ చెట్టు కిందనో జరిగిన వివాహానికి, పురోహితుడా, బాజాలా,

భజంత్రీలా, సాక్ష్యాలా, సంపన్నాలా, ఊరేగింపులా, ఎలా ఋజువు చేసుకోగలడు. ఆమాటకొస్తే ఎంతమంది బీదవాళ్ళు తమ వివాహాలను ఋజువు చేసుకోగలరు. చేసుకోలేరు గనక పెళ్ళికాలేదనడం ధర్మమా?

వీధులలో చెట్లక్రింద బతికే రిక్షావాడికి పెళ్ళేమిటను కున్నారు; కుప్పడిని హేళనచేశారు. దూషించారు. ఆఖరుకు దొరను కొట్టినమాట రూఢికనుక కోర్టువారు గట్టిగా మందలించి రెండు సంవత్సరములు కఠినశిక్ష విధించారు. నేను మళ్ళీ కుప్పడిని ఒకమాటుచూచి అప్పీలు చేసేటట్ట యితే నాకుచేతనయిన సహాయం చేస్తానన్నాను.

'అప్పీలుచేసినా ఇంతేనండి. పేదవాడిమాట ఎవరు వింటారండి'.

'మరి నీబండిలో మామూలుగా ఎక్కితిరిగేవాళ్లు పెద్దలు అనేకమంది ఉన్నారుకదా! వారిపల్లనేదీ ఉపకారం కాదా' అన్నాను.

'నాబండి ఎక్కానని పబ్లికుగా చెప్పుకోడమే వారికిసిగ్గండి. అందుచేత ఎవ్వరూమాట్లాడరండి'. అన్నాడు.

నేను విచారంతోటీ, సిగ్గుతోటీ తలవంచుకుని ఇంటికి వచ్చాను.

ఈ అన్యాయపున్యాయానికి కారణభూతుడైన యువకుడు తక్కువజాతి యురేషియను. తల్లిదండ్రుల నెరుగని నిర్భాగ్యుడు. చిన్నప్పటినుంచీ ఎవరి అదుపాజ్ఞలూ లేక, తన ఇష్టమువచ్చినట్లు, విచ్చలవిడిగాతిరిగి, కొంచెమించుమించుగా యాచనవల్ల కాలక్షేపం చేసుకునేవాడు. కాని చిన్నప్పటి నుంచీకూడా, చేతిపనులేవన్నా, నిమిషంలో చేసేనేర్పుంది. వడ్రంగం, పేమునేత, కమ్మరం, ఏదైనాసరే. అన్నిటి

కంటే ఎక్కువ మరలతోకూడుకున్న వస్తువేదైనానరే, అవ
సరమైతే క్షణంలో బాగుచేసేవాడు. వీధుల్లోదొరికిన సీనారేకు
ముక్కలు, మేకులు, ఏరుకువచ్చి, ఏదోచిన్నవస్తువు
చూస్తుండగా తయారుచేసేవాడు. ఈ తెలివితేటలు అధా
రంగాతీసుకుని క్రమేణా ఒకటోరకమైన Motor mechanic గా తయారయ్యాడు. అయితేనేమి, మంచిపనివాడిననే
అహంభావమూ, పొగరుబోతుతనమూ, జాస్తిగా ఉండడము
చేత, ఎక్కడా ఒక్కచోటా స్థిరంగా ఉండలేకపోయేవాడు.
దీనికితోడు త్రాగుడొకటి చిన్నప్పటినుంచీ అలవాటయి
పోయింది. నాలుగు డబ్బులు కనపడేసరికి అది అయిపోయే
దాకా తప్పతాగి ఉండేవాడు.

ఈ కథజరిగేనాటికి ఈ వూళ్లోనే ఒక ఇంగ్లీషు మోటారు
కంపెనీలో, నెలకు నూరురూపాయలు సంపాదిస్తుండే
వాడు. ఆ రోజున బీచిసజరిగిన గందరగోళమంతా తెల్ల
వారేసరికి ఆఫీసులో ఇట్టేపాక్కిపోయింది. నరే ఇంక కోర్టూ,
కేసూ గందరగోళంతోటి సంగతంతా అందరికీ విశద
మయింది. కాని కంపెనీలో బంట్రోతు మొదలు యజమాని
వరకూ ఎవ్వరూ ఇతనుచెప్పిన మాటనమ్మలేదు. యజమాని
ఇతన్నిపిల్చి 'కంపెనీదాటి బయటకువెళ్ళిన తరువాత మీరేమి
చేసేదీమాకు అవసరంలేదు కాని, ఇకముందు క్రిమినల్
కేసులలోనూ, మేజిస్ట్రేటు కోర్టులలోనూ, పోలీసు స్టేషను
లోనూ హాజరుకావలసిన అగత్యం కలుగ జేసుకుంటే
వెంటనే ఉద్యోగంతీసేస్తాను. ఈమాటు కోర్టువారి అభిప్రా
యం ఎలా ఉన్నా నీకథయందు నాకెంతమాత్రం విశ్వాసం
లేదు. కాని ఇది ప్రథమ తప్పిదం గనుక మన్నించాను.
ఇకముందు జాగ్రత్త' అని తీవ్రంగా మందలించాడు.

ఆఫీసులో అందరికీ తనమీదను అనుమానంగానూ, కోపంగానూ ఉన్నదని తెలుసుకొని, ఈ ఉద్యోగంకాకపోతే మరొకటనుకొని, పనికి వెంటనే రాజీనామా ఇచ్చాడు. పనికోసం ఖాళీగా తిరిగేరోజుల్లో మళ్ళీ ఈ పిల్ల ఏమయిందా, ఎప్పుడేనా కనిపిస్తుందా అని చాలాసార్లు అనుకుని పదిపదిహేను రోజులు బీచిదగ్గరా అక్కడా వెతికాడుకూడాను. ఎక్కడా కనబడలేదు. ఉద్యోగం అంతకంటే దొరకలేదు. దగ్గిర డబ్బంతా అయిపోవచ్చింది. ఏమయినా కొన్నాళ్ళు ఊరుగూరు పోతేబాగుండుననుకున్నాడు.

అక్కడినుంచి దేశాటన ప్రారంభించాడు. కొన్నికొన్ని దుష్కార్యాలకు ఫలంవెంటనే కనిపిస్తుం దనుకొంటాను. రెండుమూడు సంవత్సరములపాటు ఎన్ని ఊళ్ళుతిరిగాడో, ఎన్నిబాధలనుభవించాడో లెక్కలేదు. చేతిలోపని ఉంది కనుకరోజూ ఏరూపాయో కళ్ళచూచేవాడు. అందుకని తిండిలేక మాడకపోయినా ఈ రూపాయితాగుడికే చాలేదికాదు. ఎక్కడా నిలకడైన ఉద్యోగందొరకక ప్రాణంవిసిగి మళ్ళీ చెన్నపట్నం చేరుకున్నాడు. తేనాంపేటలో మకాంపెట్టి, మౌంటురోడ్డుషాపులో కూలిపని చెయ్యడం ప్రారంభించాడు. ఒకరోజున పనికోసం తిరిగితిరిగి ఎక్కడాదొరకక మధ్యాహ్నంకాళ్ళీడ్చుకుంటూ బసకుపోవడానికి బయలుదేరాడు. స్పెన్సరు కంపెనీదగ్గరకి వచ్చేసరికి తనముందుగా రోడ్డు దాటి స్పెన్సరుకు ఎదురుగా ఉన్ననందులోకి వెడుతున్న ఆడమనిషి ఒకతెకనుపించింది. ఎందుకో అప్రయత్నంగా ఆ మనిషిని పరకాయించిచూచాడు. నాలుగు సంవత్సరములక్రితం ఒకనాటిసాయంకాలం బీచిన జరిగిన సంగతంతా హఠాత్తుగా మానసాకాశంలో తళుక్కుమని మెరసింది.

అకాంతిలో ఈ ఆడమనిషిరూపు స్పష్టంగాకనిపించింది. తన దారి మానుకుని ఆమనిషిని వెంబడించాడు. ఆ సందులోనుంచి Madras club పక్కనుంచి Tram line వరకూ వచ్చి రాయపేట ఆసుపత్రిదగ్గిర బళ్ళస్టాండువరకూ ఆ మనిషివెనకనే వెళ్ళాడు. ఆ మనిషివెనక్కి తిరిగిచూడ లేదు. ఈ మనిషితన్ను వెంటాడుతున్నట్లు తెలుసుకోలేదు.

ఈ పిల్ల నివాసమిక్కడ కదా అనుకుని అవసరము వచ్చి నప్పుడు అక్కరకు రాకపోతుందా అనుకుని తనదారిని తను పక్కపోయాడు.

పరమేశ్వరుడు మానవుడికి ప్రసాదించిన అల్పాయుర్దా యంలో, న్యాయముపేరుపెట్టి, తోటిమానవుడు ఒకరెండు సంవత్సరాలు తగ్గించాడు. వాడి అపరాధమేమంటే, తన భార్య మానమును కాపాడడానికి ప్రయత్నించాడు. దరిద్రు డికా అధికారంకూడా లేదుకాబోలు. ఆరెండుసంవత్సరాలూ కుప్పడు జైల్లోపడినపాట్లు అన్నీఇక్కడ వర్ణించడమెందుకు? అక్కడ అధికార్లు వాళ్ళచేత చేయించేచాకిరీ, తిట్టేతిట్లూ, కొట్టేదెబ్బలూ, ఎవరెరుగరు! అందులో కుప్పడిలాంటి దరి ద్రుడు, స్వతంత్రుడు పడవలసినపాట్లు మామూలుకంటె పదిరెట్లు ఎక్కువంటేనమ్మండి.

ఇక్కడవాడిభార్య పొద్దున్న రిక్షావాళ్ళకూ ఇంకా అలాటి వాళ్ళకూ ఫలహారముచేసి అమ్ముకుంటూ సాయంకాలం బీచినిమామూలుగా వేరుశనగపప్పూ, బటానీలూ అమ్ము కుంటూ, పిల్లవాడికీ, తనకీ లోపంలేకుండా గౌరవంగా కాల క్షేపంచేసుకుంటూ, కుప్పడు ఎప్పుడు విడుదలైవస్తాడా అని రోజు ఒకయుగంగా గడుపుకుంది. కుప్పడికి రెండుసంవ త్సరాలూ రెండుయుగాల్లా ఉన్నా మొత్తంమీద గడిచిబయట

పడ్డాడు.

మళ్ళీయధాప్రకారంగా జీవితంప్రారంభించాడు. ఇంక, రోజూకనపడ్డ పోలీసుజవానల్లా 'ఏమిరా! ఈమాటు ఎవర్ని కొడతావు!' అనీ, 'ఇన్నాళ్ళు ఎవర్నీ కొట్టకుండా ఎలా ఉన్నావు' అనీ అనుక్షణం వేపుకుతినడం మొదలుపెట్టారు. అన్నిటికీ నోరుమూసుకుని సమాధానం చెప్పకుండా తిరుగుతుండేవాడు. మాట్లాడకపోయేసరికి 'పాపం, ఈ రెండేళ్ళలోనూ పొగరంతా అణిగినట్లుంది' అనేవాళ్ళు.

రెండుమూడు సంవత్సరాలు ఇలాటి అవమానాలన్నీ ఓర్చుకొని, అహర్నిశాదులు కష్టపడి, కొంతడబ్బుదాచుకుని, తనుస్వంతంగా ఒకరిక్షా, కలకత్తాలో మోస్తరుది కొనుక్కున్నాడు. దాన్ని అస్తమానంతుడుస్తూ, కడుగుతూ, Polish చేస్తూ, చూసుకుని మురిసిపోతూండేవాడు.

కొత్తబండి కొని నెలరోజులవుతుంది. కెనడానుంచి దేశసంచారంచెయ్యడానికి ఒక ధనాఢ్యుడు బయలుదేరి ఇండియాకు వచ్చాడు. మద్రాసుచేరి రెండురోజులయింది. ఆ రాత్రి బోసాటోలో భోజనంచేసి, కొంచెంతాగి బయటకివచ్చాడు. కుప్పుడుకనబడ్డాడు. దొరగారు రిక్షాలోకూర్చుని ఊళ్లో ఉండే అన్నిజాతులబోగంవాళ్ళ ఇళ్ళకూ తీసుకు వెళ్ళమన్నాడు. కుప్పుడు సరేనని నవ్వుకుని బయలుదేరాడు. డబ్బుయింతని బేరమాడుకోలేదు. దొరలతోటి బేరమెందుకు? వారెంత ఇస్తే అంతాపుచ్చుకోడమే. సాధారణంగా ఓపావలో అర్ధో ఎక్కువిస్తారుకాని మామూలికెప్పుడూ తక్కువుండదుకదా! ఎక్కేగుమ్మమూ, దిగేగుమ్మమూగా రాత్రిపండ్రెండు గంటలవరకూతిరిగారు. రాయపేట, తంగశాలప్రాంతం, పరశువాకం తిరిగి, మౌంటురోడ్డుకు దారితీశారు. బొసోటో దగ్గరకు

చేరారు. బండి అపబోయాడు కుప్పడు. 'అప్పుడే అపడ మేమిటి, ఇంకా ఒంటిగంటేనా కాలేదు, ఇంకానేటివుల ఇళ్ళ కెక్కడికైనా తినుకువెళ్ళ'మన్నారు దొరగారు. సరేనని కుప్ప డు తేనాంపేటకు దారితీశాడు.

నవలల్లోనూ, నాటకాల్లోనూ కూడా అసంభవమనుకునే సంఘటనలు, కొన్ని మామూలు జీవితంలో సంభవిస్తూ ఉంటాయి. అఘటనఘటనా సమర్థుడైన పరమేశ్వరుని కేది శక్యంకాదు! నుంగంబాకంలో ధర్మరాజు జాతర అని పది రోజులు పెద్ద ఉత్సవాలు జరుగుతాయి. కడజాతి వాళ్ళంద రకూ తిరునాళ్ళు పదిరోజులూను. ఆఖరునాడు రాత్రి గణా చార్యులంతా నిప్పుతొక్కుతారు. ఆ సంబరం చూడ్డానికి ఎక్కడెక్కడినుంచో వేలకొద్దీ జనం విరగబడతారు. ఆ రాత్రి ఈ వేడుక చూడడానికి కుప్పడిభార్యకూడా వెళ్ళింది. చూచి ఇంటికి మళ్ళేసరికి సుమారు ఒంటిగంట కావచ్చింది. గబగబ Botanical gardens దగ్గర మౌంటురోడ్డు వచ్చి ఉత్తరంగా మళ్ళింది. పది అడుగులు ముందుకు వేసేసరికి తనదారి కడ్డుగా ఒక యూరేషియను నిలబడ్డాడు. ఇతనూ సినిమాకు వెళ్ళి అక్కడా అక్కడా తిరిగి తేనాం పేటలో తన బసకు వెడదామనివస్తూ ఎదర ఈ అడమనిషిని చూచి ఫలానా అని గుర్తించి తలవంచుకొని వస్తున్న మనిషి దారికడ్డుగా నిలబడ్డాడు.

అడమనిషి తలయెత్తిచూచి వీడిని ఆనమాలు తెలుసు కొని పారిపోబోయింది. ఇతగాడు చెయ్యిపట్టుకున్నాడు. విది లించుకొని బూతులు తిడుతూ పరిగెత్తింది. వీడు తరుము కుని వెళ్ళాడు. అర్ధరాత్రివేళ నిర్జనంగా ఉన్న రోడ్డుమీద ఈ ఆడదానికి దిక్కెవరు?

కేకలు వేస్తేమట్టుకు ఎవరికేనా నిద్దట్లో వినబడతాయా? వినబడితే మాత్రం ఇవతలకి వస్తారా? ఏమీతోచక ప్రక్కను Rest shed ఉంటే అందులో ఎవరేనా ఉండకపోతారా అని అందులోకి పరుగెత్తింది. దాని దురదృష్టవశాత్తూ అందులో ఎవరూలేరు. ఇంతలోకే వెనకనుంచి ఆ మనిషి వచ్చి గట్టిగా నందిట్లో పట్టుకుని 'ఈమాటు ఎక్కడికిపోతావు' అన్నాడు. పెద్దపెట్టున కేకవేస్తూ విదిలించుకోడానికి అనేక విధాల ప్రయత్నించింది.

ఈ కేకలు దూరాన్నించే వినపడి కుప్పడు గబగబ రిక్షా లాక్కొచ్చాడు. దగ్గరకు రాగానే కంఠం తన భార్యదేనని పోల్చుకున్నాడు. వెంటనే బండి అక్కడ ఆపేసి shed లోకి పరుగెత్తాడు. నాలుగైదు సంవత్సరముల క్రితం బీచిని జరిగిన కథే ఇక్కడా జరగడం చూచాడు. అనాటి మనుష్యులే ఈనాడూను. అమాంతంగా వెనకనుంచి యూరేషియను పీక పట్టుకున్నాడు. వాడికి ప్రాణం పోతోంది. ఆడమనిషిని విడిచి పెట్టాడు. ఇంకొక్క క్షణంలో ఆ కాస్త ఊపిరీ పోను.

'You damned scoundrally son of a nigger, what the hell do you mean' అని బండిలో దొరగారు కోపావేశంతో ఇక్కడికి పరుగెత్తుకొచ్చారు. పరిస్థితులుచూచి సంగతి గ్రహించి వాళ్ళిద్దరినీ విడిపించాడు. యూరేషి యన్ను నాలుగుతిట్టి పొమ్మన్నాడు. వాడు కుక్కలా తోకముడుచుకుని, చక్కాపోయాడు.

దొరగారు ఆడమనిషిని ఎగాదిగా చూచి 'ఎవరీ మనిషి' అన్నారు. 'నా భార్య' అన్నాడు కుప్పడు. 'అలాగా, ఫరవా లేదు, బాగానే ఉందే. మా నీగ్రోపిల్లల కంటె బాగుంది.'

అన్నాడు. కుప్పుడికి విపరీతమైన కోపంవచ్చింది. దొరగారు ఒక్క క్షణం ఆలోచించి జేబులోనుంచి రెండునోట్లు తీసి కుప్పడికిచ్చి 'నువ్వు అవతలఉండు, ఆ మనిషిని ఇక్కడ ఉండనియ్యి' అన్నాడు. కుప్పడు తన కోపాన్నంతనూ దిగ మింగుకుని, 'ఇది నా భార్యసార్. అటువంటి మనిషికాదు' అన్నాడు గట్టిగా. భార్యవైపు తిరిగి వెళ్ళమని సంజ్ఞచేసాడు. దొరగారు 'Don't be a fool man' అని ఇంకోనోటు తీసి, కుప్పడిమీద పారేసి వాడి భార్యను పట్టుకోబోయాడు. కుప్పడు ఒళ్ళుమండి ఆలోచనలేకుండా సాగదీసి దొరగారిని లెంపకాయ కొట్టాడు. 'You dirty nigger dog, you dare' అని జేబులోనుంచి తుపాకితీసాడు. అది లాక్కుందామని కుప్పడు ఒక్కడుగు ముందుకు వేసేనరికి దొరగారు వెంటనే కాల్చారు. మారు మాటలేకుండా కుప్పడు చెట్టుకూలినట్లు నేలమీదపడి ప్రాణాలు విడిచాడు.

ఈ చప్పుడికి దగ్గర ఇళ్ళల్లోవాళ్ళు కొంతమంది, రోడ్డు పక్కన పడుకున్నవాళ్ళు కొంతమంది, దూరాన్నివస్తూన్న ఉత్సవజనం కొంతమంది చుట్టూ మూగారు. దొరగారికి వీళ్ళంతా తన్ని చంపుతారేమోనని ఒక్కమాటు భయం వేసింది. కానివాళ్ళంతా వట్టి పిరికిపందలని వెంటనే తెలుసు కుని ధైర్యంగాను 'దగ్గర పోలీసుస్టేషను ఎక్కడ ఉంది?' నేను రిపోర్టు చేస్తాన'న్నారు, చేతిలో పిస్తోలు అందరివైపుకీ తిప్పి; దాంతో అంతా వెనక్కుతగ్గారు. ఒక ధైర్యశాలి పోలీసు స్టేషనుకు తనతో రమ్మన్నాడు దొరగారిని. సరేనని ఆయన ఈ మనిషి ననుసరించారు. స్టేషనులో తను రిక్షావాడిని తుపాకితో కాల్చినట్లు దొరగారు రిపోర్టుచేశారు. మనిషి ఫలానా చోట ఉన్నాడన్నారు. తన బస ఫలానాచోటన్నారు. మర్నాడు

కోర్టుకు వస్తానని దర్జాగా అవతలకు నడిచారు. హంతకుడిని పోనివ్వకూడదు, రిమాండులో ఉంచాలని ఎవ్వరికీ తోచలేదు.

మరునాడు దొరవారు కోర్టుకుహాజరయ్యారు. Native judge తన్నువిచారించడానికి అర్హతలేదని ముందు అడ్డు పిటిషను పడేయించాడు తనప్లీడరుచేత. తనదారిని తనింటికిచక్కాపోయాడు. సరే, కేసు సెషన్సుకోర్టులో యూరోపియన్ జడ్జిదగ్గరవేశారు. తనుకెనడా దేశస్థుడననీ, గ్రంథకర్తననీ, ఈదేశంలో పరిస్థితులు స్వయంగా తెలుసుకోడానికి వచ్చాననీ, మూడురోజులైందనీ, ఆరాత్రి అపూరులో Night life study చెయ్యడానికి బయలుదేరాననీ, రిక్షావాడు తాగిఉండి దారిపొడుగునా పేచీపెడుతూ, ఆఖరుకు తన్నుదిగిపొమ్మనీ, తనజేబులో పర్సు కాజెయ్యడానికి ప్రయత్నంచేశాడనీ, దూరదేశంలో అర్ధరాత్రివేళ నిస్సహాయుడనై ఉండడముచేత వాడిని బెదిరించడానికి పిస్తోలుతీశాననీ, అదివాడులాక్కోవడములో పొరపాటున పేలిందనీ, దానివల్ల వాడుచనిపోయాడనీ, ఇటువంటి అవాంతరము వచ్చినందుకు చాలా విచారిస్తున్నాననీ దొరగారు స్టేటుమెంటు ఇచ్చారు.

కుప్పడిభార్యవచ్చి యదార్థం చెప్పింది. కాని, దానికి సాక్ష్యమేదీ? ఆ యూరేషియు నెక్కడా ఐపులేకుండా పోయాడు. ఈ మనిషిమాట నమ్మేది ఎవరు?

ఇంకొకమనిషి ఎవరోవచ్చి, తను ఆ సమయాన్ని ఉత్సవంచూచి ఆదారినివెడుతున్నాననీ, దొరగారికీ కుప్పడికీ జరిగినసంభాషణా, ఆయనవీడిని చంపడమూ చూచాననీ చెప్పాడు. కోర్టువారూ, దొరగారూ, వారివకీలూ నవ్వారు. అర్ధరాత్రివేళ దారేపోతూ, వాళ్ళమాటలు అక్కడపొంచుండి

వినడం ఎంత అసంభవం? అక్కడుంటే, పోనీ చంపుతోంటే చూస్తూమొద్దులాగ నిలబడ్డావా అనివకీలు హేళనచేశాడు. పాపం, ఏమిచెప్పగలడు సమాధానం! బహుశా ఈమనిషికీ ఆడమనిషికీ ఏమైనాసంబంధ మేమోనన్నారు. పుణ్యానికి వెడితే పాపం ఎదురైందట. తనచేతులో చచ్చిపోయినట్లు స్వయంగా పోలీసువారికి రిపోర్టుచేసిన న్యాయస్థుడు, విద్యావంతుడూ, అయిన దొరగారిమాటకాదని, రోడ్డేపోతున్న అనామకుడిమాట కోర్టువారు ఎలా విశ్వసిస్తారు? అటువంటివాడు అన్యాయం పలుకుతాడని అనుకోడమెలాగు? వేరేసాక్ష్యాలేమీ అక్కర్లేదని సెలవిస్తూ, దొరగారికి వందరూపాయలు జరీమానావేసి ఆసొమ్ము, కుప్పడికి భార్య అనేమాటనిజమైతే ఆమనిషికివ్వవలసినదనీ, లేకపోతేకోర్టులోనే జమకట్టవలసిందనీ తీర్పుచెప్పారు. దొరగారుకోర్టువారికి అనేకవందనములర్పించి, నూరురూపాయలనోటు విసిరివిచ్చుకుని అవతల పారేసి ఆయనదారిని ఆయనపోయాడు.

వెధవరిక్షావాడు ఒకడుంటేనేమి,పోతేనేమి! ఒకడు లోటొచ్చినంతమాత్రాన కాలచక్రం ఆగిపోదుకదా! వాడినిగురించి శ్రద్ధతీసుకుని పేచీపెట్టేవాళ్ళు ఏపార్టీవారూ, Congress, Justice, Socialists, Communists ఎవ్వరూ లేరుకదా? ఇంతకూ వాడు బ్రతికి ఉండి వెధవరిక్షా ఎన్నాళ్ళులాగుతే వందరూపాయలు సంపాదించ గలుగుతాడు? బ్రతికిఉన్న కంటె చచ్చే ఎక్కువ సంపాదించాడన్నారు కొందరు పెద్దలు. వీడి చావువల్ల వారికీ కొంత పక్క బెదురు వదిలిందేమో! దొరగారు చాలా ధైర్యశాలనీ, పెద్దమనిషి అనీ, చాలామంది అభిప్రాయపడ్డారు. ఊర కుక్కలూ, ముష్టివాళ్ళూ, రిక్షావాళ్ళూ, మొదలైన Dirty

fellows వల్ల City అంతా Ruin అయిపోతోందన్నారు కొందరు క్లబ్బులో..........

కుప్పడుపోయి ఆరుమాసాలు కావచ్చింది. నా ఆప్తులలో ఒకరు పోయినట్లు కొన్నాళ్ళు చాలా బాధపడ్డాను.

ఒకరోజున పేపరుచూస్తూండగా Indian India అని కొత్తపుస్తకం వచ్చిందని దానిపై విమర్శచూచాను. Mother India కంటె పదిరెట్లు ఛండాలంగా ఉందని వ్రాయబడి ఉంది. ఈ గ్రంథం రచించినవారు కెనడా దేశస్థులు. సుప్రసిద్ధ గ్రంథకర్తలు. నాడు కుప్పడిని చంపినవారు. మూడు వారాలు హిందూదేశంలో ఉండి ఇక్కడ అన్నిరకాల జనంతోనూ కలిసిమెలిసి తిరిగి వారి కష్టసుఖాలన్నీ స్వయంగా (మూడువారాలలో) విచారించి ఈ గ్రంథం వ్రాశామని గ్రంథకర్తగారు పీఠికలో వ్రాశారు. గ్రంథ సారాంశ మేమిటంటే హిందూదేశస్థులు పరమ దౌర్భాగ్యులనీ, దరిద్రులనీ, పిరికివాళ్ళనీ, విద్యావిహీనులనీ, నీతిదూరులనీ, వ్యభిచారులనీ, మతము పేరిట ఎన్నైనా ఘోరకృత్యాలు చేస్తారనీ, దుర్బలులనీ, రోగపీడితులనీ, ఇలాటి వెన్నెన్నో వారి స్వానుభవము వల్ల (మూడువారాలలో) తెలుసుకున్నవన్నీ వ్రాసి, పై కారణాలచేత హిందువులు స్వరాజ్యానికి ఇంకా వందసంవత్సరాలకైనా పనికిరారనీ, ఢంకామీద దెబ్బకొట్టి చెప్పారు.

పాపము శమించుగాక!

ఆ మరునాడు పేపరు చూస్తూంటే ఒక సుప్రసిద్ధ రచయిత, దేశసంచారి, ధనికుడు, కెనడాదేశస్థుడు, Motor బండిలో నుంచి పడి చనిపోయాడని ఉంది. ఏ కార్యానికి, ఏవేళ, ఏ ఫలం ఎలా అనుభవించవలసి ఉంటుందో!

ప్రొఫ్థసారథినాయుడు తన కడసారి ప్రయాణానికంతా సిద్ధం చేసుకున్నాడు. అధైర్యం కాని బెంగకాని ఏమీలేదు; అదివరదాకా కొంత అధైర్యమూ భయమూ కలిగినా ఈ అవతారం చాలించడమే ఉత్తమమని నిశ్చయించుకున్న తరువాత ఆ భయం గియం అన్నీ పోయినాయి.

రాత్రి సుమారు రెండుగంట లవుతుంది. బయిట పండు వెన్నెల. చల్లని మలయమారుతం. అన్నివైపులా పుష్ప సౌరభము. ప్రకృతి అంతా తన్ని సంతోషంతో సాగనంపుతోన్నట్లుంది. అంతకంటె కావలసిన దేమున్నది.

ఒక్క విషయమే మధ్యమధ్య చురుక్కుమనిపిస్తోంది. కొద్దిరోజులలో ప్రభుత్వమువారు (Sir) బిరుదు ప్రసాదిస్తారని నిశ్చయంగా ఆరోజుననే తెలిసింది. అదికాక ఈసారి ఎన్నికలలో తనకు మంత్రిపదవి తప్పదని తమ పార్టీవారు ఏకగ్రీవంగా అన్నారు. (Lord Mayor) కావడానికీ తగ్గ అవకాశములుకూడా లేకపోలేదు. ఇంతకాలం ఉండి తన కోర్కెలు కొద్దో గొప్పో సిద్ధించపోతున్న సమయంలో తన ప్రాణత్యాగం చేసుకోవలసివచ్చినందుకుమట్టుకు కొంచెము బాధగానే ఉన్నది. కొంచెముసేపుంటే అదీ పోతుంది.

తన కాగితాలూ రికార్డులూ ఎక్కడి వక్కడ అన్నీ జాగ్రత్త పెట్టాడు. జమా ఖర్చు పుస్తకాలన్నీ సవరించి ఒక చోట పెట్టాడు. రాయవలసిన ఉత్తరాలన్నీ రాశాడు. కాని ఇంక అఖరు ఉత్తరం రాయడానికిమట్టుకు చెయ్యాడలేదు కొంతసేపు. తన కొడుక్కి రాయాలి. పంచప్రాణాలు వాడి మీద పెట్టుకొని, వాడి నేదో మహామహుణ్ణి చేదామనుకొని, అనేకములైన ఆశలూ, వాంఛలూ, వానిలో కల్పించి, ఇప్పుడవన్ని మట్టిలో కలిపి వాడిని ఫకీరుని చేసిపోతూ ఏమని

రాయడమా అని కొంచెము సందేహించాడు. కాని రాయక తప్పదుకదా అని ఆరంభించాడు.

ఇంటా బయటాకూడా అంతా నిశ్శబ్దంగామా ప్రశాంతం గానూ ఉంది. ఒక్కసారి కిటికీలోనుంచి నవ్వుతున్న చంద్రుని చూచాడు. ఉత్తరం వ్రాయడమారంభించాడు....
అవును. ఆత్మహత్య చేసుకోవడము చాలా, కష్టమే. కాని బ్రతుకుకంటే చావే సులభంగా తోచినప్పుడు ఇంక చెయ్య తగిన దేమున్నది. పిరికితనమేకావచ్చు: ఈకర్మఫలం ఎప్పుడో ఒకప్పు డనుభవించక తప్పదంటారు' మనవాళ్ళు. కాని ప్రస్తుతం, మన్ని ఖండఖండాలుగా చించి చెండాడవలెనని వేచిఉన్న ఈ నరసింహములనుండి తప్పించుకొని దాటిపోతే తరవాత అనుభవం సంగతి అప్పుడు చూడొచ్చు....ఈ ఆస్తి అంతా నాచేతులతో సంపాదించాను. నాచేతులతోనే తగ లేశాను. ఇంకొకళ్ళ ననవలసిన పనిలేదు. ఎలావచ్చిందో తెలియదు. ఎలాపోయిందో అంతకంటె తెలియదు. కాని ఒక విషయం-అప్పుడు ఎవళ్లుచెప్పినా ఒప్పుకోలేదు. కాని ఇప్పుడు ఒప్పుకోక తప్పదు. అన్యాయార్జితవిత్తం నిలవదు. ముమ్మా టికీ నిలవదు. అనేకమంది కూలినాలి చేసీ ముష్టి ఎత్తుకొనీ సంపాదించుకున్నవాళ్లు, అనేక మంది వితంతువులు, తిండి కూడా మానుకుని ఆఖరుకు తమ ముప్పుగడవడంకోసం కూడపెట్టుకున్న చిన్న మొత్తాలు, అందరూ నన్నునమ్మి ఏదో వడ్డీ వస్తుందని నాదగ్గర దాచిపెట్టారు....అవన్నీ నా స్వాధీనం చేసుకున్నాను. ఏకోర్టువారూ నన్ను శిక్షించలేదు. కాని ఇంత మంది ఉసురూ తగలదూ! న్యాయం విచారించి శిక్షించ గలిగిన సాహసుడైన ప్రభువేఉంటే ఈ వ్యాపారస్థులలో ధని కులలో ఎంతమంది, ద్వీపాంతరవాస మనుభవిస్తారో!

మాబదులు ఆ శిక్షలన్నీ అన్యాయంగా నిరుపేద లనుభవిస్తున్నారు. నేను ఎప్పుడు ఏపనిచేసినా, దేనికీ పశ్చాత్తాపపడే వాడిని కాను. తెలియకచేసిన దానికి పశ్చాత్తాపముకాని, తెలిసి ఉండి కష్టనష్టములు ఆలోచించి చేసేపనికి పశ్చాత్తాప మేమిటి? ధనార్జన చెయ్యవలెనని నాకు బుద్ధిపుట్టినప్పుడు, మంచిచెడ్డ, ఉచ్చంనీచం అనే విచారణకూడా లేకుండా ధనార్జనచేశాను; స్త్రీవాంఛ కలిగినప్పుడు ఏ పద్ధతినైతేనేమి నేకోరిన స్త్రీని సంపాదించి తీరాను. కాని సింహావలోకనం చెయ్యడం, చేసినపనికి విచారించడంమట్టుకు ఎప్పుడూలేదు. పుణ్యమో పాపమో వాటి ఫలితం నేను అనుభవించి ఎరుగను. ఇకముందెప్పుడో అనుభవిస్తానంటే నాకు నమ్మకం లేదు.

కాని నేను చేసిన రెండు పనులకు మట్టుకు, నాటినుంచి నేటివరకు విచారిస్తున్నాను. భయపడుతున్నాను. వాటి ఫలితమే ఇప్పు డనుభవిస్తున్నాననే దృఢవిశ్వాసం కలిగింది నాకు. రెండూ అప్రయత్నంగా అనాలోచితంగా చేశాను. శాపమన్నా పాపమన్నా నమ్మకం భయంలేని మొండివాడికి, శాపభీతీ పాపభీతీ కలిగించినాయి. ఏమిలాభమిప్పుడు! అనుభవంలోకి వచ్చిన తరువాత కాని తెలియలేదు, నమ్మకం కుదరలేదు. ఇప్పుడు నమ్మకం కలిగి ఏమీ చేయడానికి వీలులేని పరిస్థితులు వచ్చినాయి.

ఇంతవరకు ఆ ప్రశంస ఎవ్వరిదగ్గరా తేలేదు. నాలోనేను అనుకోడానికికూడా భయపడేవాడిని. ఏదో భయంకరమైన అపాయం వస్తుందని తెలిస్తే ఫలాని మోస్తరు అపాయమని తెలియనంతసేపూ చాలా భయంగా ఉంటుంది. ఫలానాఅనీ అది అనివార్యమనీ తెలిసిన తరువాత ఇంక భయమే

ముంటుంది? రాయిచేసుకు కూర్చోడంతప్పు చేసేది మరొ క్కటిలేదు. కాని ఈ ఆఖరు క్షణంలో నీతో చెపుతే కొంత హృదయభారం తీరడమే కాకుండా, నీ ముందు జాగ్రతకు కొంత ఉపయోగంగా ఉంటుందని నా నమ్మకం.

ఒకప్పుడు మనయింట్లో దొంగలు పడ్డారు. ఎలా వచ్చారో, ఎలావెళ్లారో తెలియదు. ఎక్కడా ఒక కన్నము తవ్వడం గాని, ఒక తలుపు బద్దలు కొట్టడంగాని, ఒక తాళం బద్దలు కొట్టడంగాని జరగలేదు. ఎలాగైతేనేమి ఇంట్లో ఉండే వస్తువు లన్నీ సుమారు పదివేలుకిమ్మతుగలవి పోయినాయి. నాటికీ నేటికీ ఆ వస్తువుల జాడకాని దొంగలజాడగాని, తెలియలేదు.

మన యింటి కెదురుగుండా రోడ్డుమీద మర్రిచెట్టు కింద ఒక నిరుపేద కుటుంబము, భార్యా, భర్తా, ముగ్గురు పిల్లలూ ఉండేవాళ్లు. వాళ్ళెవల్లో, ఎంతకాలంనుంచి అక్కడఉన్నారో, ఆ కుటుంబంలో ఎంతమంది ఉన్నారో, వాళ్ళకు జీవనం ఎలా గడుస్తోందో నేనెప్పుడూ విచారించలేదు. నాకేమి అవ సరం? కాని ఇప్పుడు వస్తువులు పోవడంతోటే మట్టుకు అను మానం వాళ్ళమీద పోయింది. పేదరికమంటే అందరకూ లోకువేకదా. ముందు ఇంట్లో నౌకర్లనందరనూ ప్రశ్నించి, వాళ్ళ సామానులూ ఇళ్లూ సోదాచూచి తరువాత నా అను మానంమీద పోలీసులు ఈ చెట్టుకిందవాడినికూడా ప్రశ్నించి వాడి సామానులుకూడా అన్నీ వెతికారు పాపం! అన్నీ ఏమున్నాయి? ఒక పెట్టా; బేడా! ఏమీలేదు. కుండలూ, దాకలూ, మూకుళ్లూ, ఎవళ్ళో వీధులో పారేసిన సీనారేకు డబ్బాఒకటీ, సీనారేకుగొట్టాలు రెండూ, ఇదీవాడి సంసారము; ఇందులో వాడి దురదృష్టముకొద్దీ, నా దురదృష్టముకొద్దీ, రెండు రవ్వల ఉంగరాలు, ఒక రవ్వలదుద్దూ దొరికినాయి.

ఇంకేముంది! వాడిని పట్టుకొని Police stationకి తొక్కుపోయారు 'నాకు spur tankలో దొరికాయి' అని వాడు ఎన్నివిధాల మొత్తుకున్నా వాడిమాట వినేవారెవరు? రోడ్డుమీదా చెరువుల్లోనూ రవ్వల ఉంగరాలూ దుద్దులూ పడి దొర్లుతూ ఉంటాయా మరి!

ఇంక నక్కడనుంచి మామూలుకథే! పోలీసువారు వాడిని కుళ్ళపొడవడం, ఎంతకొట్టినా తన కారోజు ఉదయాన్నే అవి దొరికినవికాని తనేపాపమూ ఎరుగననీ వాటి విలువకూడా తనకు తెలియదనీ ఎన్నివిధాల చెప్పినా వినక వొళ్ళు స్వాధీనంలేకుండా కొట్టి రెండుసంవత్సరములు కఠిన శిక్ష వేశారు.

పోలీసువారు కొట్టిన దెబ్బలవల్ల లోపల అవయవములు నలిగిపోయి జబ్బు ప్రవేశించింది. ఖైదీలకు అందులోనూ ఇటువంటి దరిద్రుడికి జబ్బుచేస్తే లక్ష్యపెట్టేది ఎవరు? అడిగేదెవరు? ఆజబ్బుతోటే ఆలాగే కాలక్షేపం చేసుకుని బయిట పడ్డాడు. మన ఇంటి ముందునుంచి వాడిభార్యా బిడ్డలూ మకాము ఎత్తేసి మరొక చెట్టుకిందకు పోయారు.

రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. ఈసంగతంతా నేను మరచిపోయాను. ఒకరోజు సాయంకాలం, సుమారు అయిదు గంటలకు రటాన్ బజారులో చల్లారాం షాపుదగ్గరకు వచ్చి, లోపలికివెళ్ళి నాకు కావలసిన ఒకటి రెండు వస్తువులు కొనుక్కొని, వచ్చి కారుదగ్గర నిలబడ్డాను. లోపలనుంచి నౌఖరు అసామాన్లు తెస్తున్నాడు.

ఇంతలోనే ఇద్దరు ముగ్గురు వీధుల్లో తిరిగేవాళ్లు ఒక మూకుడుపట్టుకొచ్చి, అక్కడ వాళ్ళమనిషి ఒకడుచచ్చిపోయాడనీ, తీసుకుపోయి దహనంచేసుకోడానికి ధర్మం చెయ్యమనీ

అడిగారు. ముష్టి ఎత్తుకోడానికి ఇదొక దొంగవేషమని నేననూ కుని పొమ్మన్నాను. ఎన్నిసార్లు చెప్పినా పోలేదు. ఇటువంటి దొంగవేషాలువేస్తే Policeవారికి వప్ప చెపుతానని గట్టిగా కేకవేశాను. చుట్టూ పదిమంది మూగారు పోలీసులకు చెపుతే మాకేమిభయమా, మేము దొంగతనము చేశామా, చూడండి అక్కడనే శవమున్నది. గొప్పవారు కదా అని ఇటువంటి కష్టములో ధర్మమడుగుతే బెదిరిస్తారేమిటని అందులో ఒకతను ఎదురుతిరిగి సమాధానం చెప్పాడు. సరే ఏదో పారేద్దామని జేబులో చెయ్యిపెట్టేసరికి తల విరియబోసుకొని గుండెలు బాదుకుంటూ పెద్ద పెట్టున ఏడుస్తూ శోకదేవతలాగ ఒక అడమనిషి వచ్చింది. నన్ను చూడడంతోనే మరింత కేకలేస్తూ వీడే నా మొగుణ్ణి చంపినవాడు. నాకూడు మంటగలిపాడు: నాపిల్లలను దిక్కుమాలిన వాళ్ళను చేశాడు; నా ఉసురు వీడికి తగలకపోతూందా? వీడిపిల్లలిలాగే ఎప్పుడేనా ముష్టెత్తుకోకపోతారా? అని గుక్కతిప్పుకోకుండా నోటికి వచ్చినట్లల్లా తిట్టడ మారంభించింది. నాడు నేను నిర్హేతుకంగా ఖైదుకు పంపినవానిభార్య అని పోల్చాను. ఖైదునుంచి వచ్చినతరువాత లేవలేదుట. అలా తీసుకు తీసుకుని యమబాధ పడిపడి చచ్చిపోయాడుట. ఇదంతా ఏమి తెలుసు నాకు? ఆంతకంతకు చుట్టూ జనసమూహ మెక్కువయింది. జనమెక్కువైన కొద్దీ అమనిషి ఏడుపూ తిట్లూ ఎక్కువైనాయి. అందరూ ఆమనిషికి సానుభూతి చూపినవారే! ఇక్కడనుంచి త్వరగా అవతలకుపోతే పూట దక్కుతుందని, జేబులోనుంచి పదిరూపాయలుతీసి మొదట ముష్టికివచ్చినవాడి మూకుట్లో పడేశాను. వాడుపోబోతుంటే ఆ అడమనిషి గభీమని వాడచేతుల్లోంచి మూకుడు లాక్కొని

త్వరలోనే నిన్నుతగలెయ్యా డానికి నీ కొడుక్కి అవసరముం టుంది పుచ్చుకో అని అరూపాయలు నామొహాన్ని వేసి కొట్టింది. అక్కడున్న జనసమూహమంతా ఒకసారి 'బలే' అన్నారు. ఇంతలోనే పోలీసుజవాను ఒకడొచ్చి ఏమిటీ అల్లరనేసరికి అంతాతప్పుకున్నారు. నేనూ నాకారులో ఎక్కి ఇంటికిచేరుకున్నాను. కాని నావొళ్లు అపాదమస్తకం కంపిం చిపోయింది. అమనిషిని చూస్తేనే చేసినపాపం నన్నుశిక్షించ డానికి మూర్తీభవించినట్లుగా కనపడ్డది. ఎప్పుడో ఒకప్పుడు అమనిషిశాపం నాకు తగిలి తీరుతుం దనుకున్నాను, తరు వాత అసంగతంతా మరచిపోయానుగాని మళ్ళీ ఈసమ యంలో జ్ఞాపకంవచ్చింది. అ శాపఫలమే సుమా ఇది. ఆశ్చ ర్యంగాలేదూ !

ఇంక రెండోసంగతి. నాకు ఉత్సవాలన్నా జనసమూహా లన్నా చాలాసరదా. అపేక్ష ఏమీ లేకపోయినా ప్రజలుచూపే ఉత్సాహమూ, అక్కడచేరే సౌందర్యమూ చూడవలెనని కుతూహలం. అందుచేత ఎక్కడ ఏ ఉత్సవమైనా తప్ప కుండా వెళ్ళి కొన్నిగంటలు కాలక్షేపం చేసేవాడిని. అలాగే అనాటి ముక్కోటి ఏకాదశిరాత్రి ఉత్సవానికి పెందలాడే భోజ నంచేసి పార్థసారధిగుడికి వెళ్ళాను. దేవుడిమీద భక్తిచేతకా దనివేరేచెప్పేదేమిటి !

అటువంటిసమయాల్లోసాధారణంగా నాకుకలిగే అనందం కంటె అనాడు నాకు పదిరెట్లు ఎక్కువ అనందం కలిగింది. కారణం నేను చెప్పలేను, అ దీపపు వెలుగులు, అ స్త్రీ సమూహము, వారిశరీర కాంతీ, వాటినతిశయింపచేసే వారి చీరరంగులు, వారి అంగముల నలంకరించియున్న రత్నద్యుతులు, అక్కడి వివిధపరిమళములు, పారవశ్యము

కలిగించే సంగీతము, ప్రయత్నముగనో అప్రయత్నముగనో లభించిన స్త్రీస్పర్శా—వీటి అన్నిటివల్లా కలిగిన ఆనందం ప్రతిరక్త నాళములోనూ ప్రవేశించి నన్ను ఉన్మాదునిగా చేసింది. తనివితీరగా సురాపానము చేసినవాని వలె ఈ సంతోషం నాతలకెక్కి శరీరంచులకపడి వాయువులో తేలిపోతున్నట్లుగా ఉంది. ఇంకనక్కడ ఉంటే పిచ్చి యెత్తుతుందేమోనని భయపడి ఇంటికిపోదామని బయలుదేరాను.

అప్పటికి సుమారు ఒంటిగంటపైగా అయింది. కొంత మంది జనం మళ్ళు మొగంపెట్టారు. నేను నెమ్మదిగా పమ్మర్ధంతప్పించుకొని సుంకువారి వీధిలోనికివచ్చి అక్కడ నుంచి వెంకటరంగంపిళ్ళె వీధులోకిమళ్లాను. అక్కడ పదిగజాలదూరములో కొంతమంది జనం కూడిఉన్నారు. ఒక ఆడమనిషి కేకలు వినపడ్డాయి నేను తొందరగా అడుగువేసి అక్కడికి చేరుకొన్నాను. ఆజనాన్ని చూచి 'ఏమిటీ అల్లరి! మంచి పౌరుషశాలులే! ఇంతమంది చేరి పరదేశస్థురాలు ఆమెకు తెలియని భాషలో ఏమిటీ అంటున్నారు! ఏదీ మొగాళ్లు! ఇప్పుడు మాట్లాడండి చూతాము Police man కూడా సమీపంలోనే ఉన్నాడు.' అనే సరికీ ఇల్లేసామీ అని ఎవరిమట్టుకువారు జారిపోయారు.

ఆ స్త్రీ ఒక్కర్తే వెక్కివెక్కి ఏడుస్తూ తలవంచుకు నిలబడ్డది. నాకు జాలివేసి 'ఏమమ్మా భయంలేదులే. ఇంక ఎవళ్లూ నీజోలికిరారు. నీవు నిర్భయంగా వెళ్లవచ్చును' అన్నాను.

ఆమెవైఖరినిబట్టి బట్టకట్టునుబట్టీ ఆంధ్రవనిత అని ఊహించాను. నేను పలుకరించగానే ఆమె తల ఎత్తి నాకేసి నిదానంగా కన్నీటిచాటునుంచి చూచింది. విచారముచేత

పొంగినకళ్లు కాటుకకంటి నీటిచే తడిసి మలినమైన చెక్కిళ్లు ముఖంలో కనపడుతున్న నిస్పృహా చూస్తే దైన్యము మూర్తీభవించినట్లు కనపడ్డది. వర్షపు మబ్బుచాటునుంచి తొంగి చూచే చంద్రబింబమువంటి ఆమె ముఖంచూస్తే నిరుపమాన సౌందర్యవతి అని తెలుస్తోంది. ఆమె వయస్సు సుమారు పందొమ్మిది, ఇరవై సంవత్సరములకంటె ఉండదు. ఆమె శరీరం చూస్తే శిల్పిచెక్కిన విగ్రహాన్ని మించిపోయి లావణ్య నిధివలె అగుపిస్తోంది. నేను అనేకవేలమంది స్త్రీలను చూచాను. అత్యంత సౌందర్యవతులనుకునే వాళ్లను కూడా చూచాను. కాని ఈమె పక్కను నిలబడతగ్గవాళ్లు ఎవరూ నా కప్పుడు స్ఫురణరాలేదు. ఆంధ్రులలో అందమూ, నాజూకూ ఏనాడో అంతరించినవని అనుకునేవాడిని. ఆ అపయశస్సును పోగొట్టడానికి ఈపిల్ల ఒకర్తి చాలు.

ఆమె మాట్లాడకుండా అలాగే నిలపడ్డది. 'ఏమమ్మా ఎక్కడకు వెళ్ళవలెను? భయంలేదులే చెప్పు' అన్నాను. దానితో ఆమె మళ్ళీ కంటనీరు పెట్టుకొని, పొంగివస్తూన్న దుఃఖాన్ని ఆపుకొని, తను బ్రాహ్మణబాలికనని, గోదావరిజిల్లా నుంచి ఈవూళ్ళో బంధువులింటికి వచ్చాననీ, ఇంకాకొంద రాడవాళ్ళతో ఉత్సవం చూడడానికి వచ్చాననీ, జనసమూహంలో వాళ్ళనుంచి విడిపోయి దారితప్పిపోయాననీ, ఏమి చెయ్యడానికీ ఎక్కడికి వెళ్ళడానికీ తోచక వీధంటవస్తూ దారి అడుగుతే ఆ మనిషి ఏదో అన్నాడనీ చెప్పి, 'తండ్రీ, సమయానికి దేవుడులా వచ్చారు. లేకపోతే నా గతి ఏమయ్యేదో' అని మళ్లీ కంటనీరుపెట్టుకుంది. 'మరి అయితే ఇంటికి వెళ్లగలవా' అన్నాను. తనకు దారి తెలియదనీ ఆ వీధిపేరు కూడా బాగా తెలియదని మైలాపూరులో తన బంధువు

ప్లీడరనీ చెప్పింది. 'సరే అయితే నీకేమి భయంలేదు. నేను తీసుకువెళ్ళి మీ ఇంటిదగ్గర దిగపెడతా'నని చెప్పాను. మొదట కొంచెము సందేహించింది కాని మరొక దారిలేక నాతో రావడానికి అంగీకరించింది.

ఆ వీధి చివరనే ఒక రింటిదగ్గర నిలబెట్టిన నా కారు దగ్గ రకు తీసుకువెళ్లి ఎక్కమన్నాను. మళ్లీ కొంచము తటపటా యించింది. 'భయంలేదమ్మా ఎక్కు, లేకపోతే ఇందాకటి మోస్తరుగానే జరుగుతుంది' అన్నాను. దానితో భయపడి కారులో ఎక్కికూచుంది.

నేనూ లోపలికి ఎక్కి In house రోడ్డులోనుంచి మెరీ నాకు పారితీశాను, చల్లగాలి, సముద్రపురొద, ఇవన్ని నిర్మల మైన అకాశం, నా పక్కన సౌందర్యరాశి నా సదుద్దేశాన్ని మార్చి నన్ను సాయంకాలంనుంచి దహించివేస్తూన్న కామో ద్రేకాన్ని ద్విగుణీకృతం చేశాయి. నామదనాగ్నికి తగ్గ అహుతి దొరికిందనుకున్నాను. ఈ పిల్లను అనుభవించి మరీ ఆమెను పంపవలెనని నిశ్చయించుకున్నాను. అమె అంగీకరించదేమో నన్న ఆలోచనేనాకు తోచలేదు. మొదట కాస్సేపు బిగిసినా తరువాత నాచేజిక్కిన వెనక ఒప్పుకోక ఏమిచేస్తుం దను కున్నాను.

అపిల్లను మొదటచూచినపుడు కలిగిన జాలిఅంతా అంత రించింది. ఈరూపందాల్చిన చక్కదనాన్ని ఎప్పుడు కౌగిట చేరుద్దామనే ఆతురత తప్ప మరొకటేమీ తోచలేదునాకు. ఇటు వంటి అవకాశములు అనేకం వచ్చినాయి నా జీవితంలో. అనేకసార్లు అఅవకాశములను ఉపయోగించుకున్నాను. ఇప్పుడు మట్టుకు అలా ఎందుకుకాకూడదు. ఇటువంటిపిల్ల నాభార్య అని చెప్పుకోగలిగిన ధన్యు డెలాటివాడై ఉంటాడా

అనుకున్నాను. ఈ చక్కదనానికి తగ్గవాడవునా కాదా అనే ఆలోచన పోయింది. ఈమెకు తగినవాడని చెప్పతగిన పురుషుడు సృష్టిలో ఉంటాడా అనుపించింది. నెమ్మదిగా Ethiop's beach చేరి కారు ఆపాను. ఆదివరకు ఏమి ఆలోచించుకుంటోందో కాని కారు ఆగడముతోనే ఉలిక్కిపడి నాల్గుప్రక్కలా చూచింది. నేను దిగి ఆమె కూర్చున్నవైపు తలుపుతీసి దిగమన్నాను. తెల్లపోయి 'ఎందుకు' అంది.

'కొంచెముసేపు ఈ చల్లగాలిలో కూర్చునిపోవచ్చును' అన్నాను.

'కాదు నన్ను త్వరగా ఇంటికి తీసుకువెళ్ళండి' అంది. 'అలాగేలే. త్వరగానే వెడదాము. రా' అని చెయ్యిపట్టుకున్నాను. కేకవెయ్యబోయింది. ఒక చెయ్యి నోటిమీదవేసి, రెండవచెయ్యి ఆమె నడుముచుట్టూవేసి బలవంతాన బయటకు లాగి సముద్రపుటొడ్డుకు తీసుకువెళ్లాను. ఆ ఇసుకతిన్నెమీదకూర్చుని, నాపక్కనే కూర్చోపెట్టుకొని నోటిమీద చెయ్యి తీసి గట్టిగా కౌగలించుకొని, 'ఎందుకలా భయపడతావు. ఇప్పుడే తీసుకువెళ్ళి మీ ఇంటి దగ్గర దిగపెడతాలే' అన్నాను. 'మీరు తండ్రివంటివారనుకుని మిమ్మల్ని నమ్మినాను. మీరూ ఇలాంటివారేనా' అంది ఏడుస్తూ. అప్పటికీ ఆ మనిషి స్వభావం తెలుసుకోలేకపోయాను. ఇవి మామూలు మాటలే అనుకున్నాను. మరొక్కమాటేనా ఆడలేదు. కేకలన్నా వెయ్యలేదు. నా కౌగిటిలోనుంచి విడిపించుకునే ప్రయత్నమైనా చేయలేదు. నేను ఏమనుకోను? నాకౌగిలిపట్టు ఇంకా బిగించి ఒక్కముద్దు పెట్టుకున్నాను. నిర్ఘాంతపోయి నాకేసిచూచింది. ఆచూపు జన్మజన్మాలకూ నాకుమరపురానిది. భయము, సంభ్రమము, ఆశ్చర్యము, ఇంకా ఎన్నెన్నో భావాలు ఆ చూపులో

కనపడ్డాయి. ఒక్క చూపులో ఏకకాలమందు ఇన్ని భావములు ప్రదర్శించుటకు సాధ్యమౌతుందని నేను ఎన్నడూ అనుకో లేదు. మరొకళ్ళుఅయితే ఆ చూపుకి భయపడి అంతటితో తమ ప్రయత్నమును మానుకునేవారేమో! నేనైనా మరొక సమయంలో అయితే బాగా ఆలోచించి మరీ ముందుకు సాగే వాడిని. కాని ఆ క్షణంలో నాకు ఒళ్ళు తెలియలేదు. నాశరీరంలో ప్రతి రక్తబిందువూ ఉడికిపోతోంది. సర్వేంద్రియములూ స్వాధీనము తప్పిపోయినాయి. న్యాయాన్యాయ విచక్షణా విహీనుడనయిపోయినాను. ప్రమాదస్థితిని తెలుసుకో లేకపోయినాను. అంతేకాకుండా పతివ్రతలంటూ ప్రపంచములో ఉన్నారని నాకు నమ్మకంలేదు. ఎటువంటి స్త్రీ అయినా, ఏదో రూపంలో తగినంత ప్రతిఫలం దొరుకుతే పర పురుషునికి స్వాధీనం కావడాని కంగీకరిస్తుందని నా దృఢ విశ్వాసము. వాడెవడో చెప్పినట్లు (Every woman has her price) అనేమాట ముమ్మాటికి సత్యం అని నా నమ్మకం; అనుభవంకూడాను. అటువంటప్పుడు ఈ పందొమ్మిదేళ్ల పల్లెటూరుపడుచు వారందరికీ అతీతురాలని ఎలా అనుకోను?

ప్రపంచమంతా నిశ్శబ్దము. సముద్రపుహోరుకూడా ఆక్షణంలో నాచెవిని పడలేదు. చేతనాచేతన ప్రపంచమంతా కూడా ఒకసారి ఊపిరి బిగబట్టి ఏమి జరుగుతుందో చూతామని ఆశ్చర్యముతో వేచివున్నదనుకుంటాను. ఆకాశము మట్టుకు తన అనంతకోటి నక్షత్రకాంతులతో నవ్వుతున్నట్లున్నది. నామదనాతురత నింక నణచుకోలేక పోయాను. ఆపిల్లను నావడిలోకి లాక్కొని రొమ్ముమీద చీరావిరకా తొలగించి ఒళ్ళుతెలియకుండా లెక్కలేని ముద్దులు పెట్టు

కున్నాను. ఒకొక్కక్క ముద్దు పెట్టుకుంటున్నకొద్దీ నా ఆవేశము మరీహెచ్చిపోయింది. ఆపిల్ల నిర్నిమీలిత శూన్యదృష్టితో నాముఖంకేసి చూస్తూ ఊరుకుంది. గత్యంతరంలేక శరీరం నాకు వప్పగించిందిఅనుకున్నాను. మొదట నాచేతులలో ఆమె శరీరం కొంచెము బిగిసిపోతూందనుకున్నాను. క్రమేణా పట్టు తప్పిపోయినట్లు నాచేతుల్లోనుంచి జారిపోవడం మొదలు పెట్టింది. నే నీముద్దులతో ఊపిరిఆడక ఆమెను ఇసుకమీదకు జారవిడిచి ఒక్కరెప్పపాటు ఊపిరి తీసుకున్నాను. రెప్ప వాల్చకుండా ఆమె అలాగే నాకేసిచూస్తోంది. ఎందుచేతననే ఆలోచనతోచలేదు నాకు. పునరాలింగన చుంబనాదుల కామెను లేవదీయబోయాను. ఆమెశరీర మదొకమాదిరిగా బలువెక్కినట్లు తోచింది. తల వెనక్కు పడిపోయింది. ఇదేమిటి మూర్ఛపోయిందా అనుకుని మళ్ళీ పడుకోపెట్టి ఇటూఅటూ కదిపి పలకరిస్తే పలకలేదు. అరిచేతులూ అరి కాళ్లూ రాశాను. నీటిఒడ్డుకు పరుగెత్తికెళ్ళి దోసిలితో నీళ్లు తెచ్చి ముఖాన్ని చల్లాను. ఏమిచేసినా లాభంలేకపోయింది. ఇదొక జబ్బు కాబోలు క్రమేణతెలివి వస్తుందనుకున్నాను. అప్పటికి నాఉద్రేకం చల్లారింది. ఒకవిధమైన భయమారంభ మయింది. ఇంటికి పోయేవాడిని పోక ఇదెందుకు తెచ్చు కున్నానా అనుకున్నాను, అలాగు అరగంటో ముప్పావుగంటో కూర్చున్నాను. ఎంతకూ ఆమెకు తెలివిరాలేదు. సరిగదా క్రమేణా వొళ్లు నఖశిఖపర్యంతం చల్లపడిపోయింది. ఆ పిల్ల చనిపోయిందని గ్రహించాను. వర్ణనాతీతమైన భయంతో నా శరీరంయావత్తూ కంపించిపోయింది. నా ప్రథమ చుంబన ముతో ఆమె ముఖమును నేను మలినపరచినప్పుడే ప్రాణం పోయిఉండవలెనని ఊహించాను. ఆ నిర్నిమీలిత దృక్కుల

భావమది అయిఉండవలెను. పాపం, యౌవనోదయవేళ తన వాళ్ళందరకూ దూరమై, ఈ నిర్జన ప్రదేశంలో పరాయివాని చేతిలో ఈ నిర్భాగ్యపు బలవన్మరణం రాసిపెట్టిఉన్నది ఆ పిల్లకు. నేను హంతకుడిని. చేష్టలుడిగి, రాతిబొమ్మలా కూర్చున్నాను. ఒళ్లుముచ్చెమటలూపోసి నీరుకారిపోవడం మొదలెట్టింది. అపిల్లమీద జాలిపోయి ముందు సంగతేమిటనే ఆలోచనపోయింది. కూర్చున్న కొద్దీ ప్రతిక్షణమూ ప్రమాదకరమని తోచింది. అదివరకు నిర్జనమనుకున్న సముద్రతీరం అనేక కోట్లజీవరాసులతో నిండిఉన్నట్లు తోచింది. నిశ్శబ్దంగా ఇంత వరకూ ఉన్నసముద్రం గర్జనిర్భేదముగా రోదించడం మొదలెట్టింది. స్తంభించిపోయినదనుకున్న వాయువు ప్రచండ వేగముతో నాచెవులు చిల్లులు పడేటట్లు కోటిగొంతుకలతో అరవడము ఆరంభించింది. దూరాన్ని వెడుతున్న మోటారుకారు ఒకటి ప్రళయ గర్జనతో నామీద వచ్చి పడుతుందనుకున్నాను. నావెనుక తిరువళక్కేణి ఉత్సవములోని దీపపు కాంతులు నరకజ్వాలలులా కనపడ్డాయి. ఆకాశాన ఉన్న నక్షత్రకోటులు కన్నీరు కార్చడం మొదలెట్టినాయి. దిక్కులేకుండా నిర్జన ప్రదేశంలో చనిపోయిన ఈపిల్లకోసం చేతనాచేతన ప్రపంచం యాపత్తు విచారిస్తున్నట్లు తోచింది.

అనిర్వాచ్యము అపూర్వము అననుభవము అయిన మహాభీతి నన్నావరించింది. ఆ కళేబరాన్ని ఎవరికంటాపడకుండా ఎక్కడో పారవేసి నేను ఇల్లు చేరడమే ప్రధాన కర్తవ్యమని తోచింది. భయముతో స్వాధీనము తప్పిపోయిన అవయవములకు వింతబలం వచ్చింది. మంచుకంటె చల్లనై కొయ్యబారిన కళేబరాన్ని తీసుకొని కారులో పడేసి మళ్ళీ కారువచ్చినదారినే తిప్పి కోటసమీపంలో కారు ఆపి ఈ వింతబరువును

మోసుకొని సముద్రంలో వీలైనంతలోతు తీసుకవెళ్ళి నీళ్ళలో గిరవాటువేశాను. ఆఖరుసారి ఆఅమ్మాయి ఆ Shocked innocent చూపుతో నన్నుమందలించింది. నాటనుండి ఈ ఆఖరిక్షణంవరకూ అహర్నిశములు జాగ్రత్స్వప్న సుషుప్తులలోకూడా ఆ కడసారిచూపు నన్ను వెంబడిస్తూనే ఉంది. అనేక జన్మపరంపరలలో నాటి మహాపాపమునకు తగ్గ ప్రాయశ్చిత్తమును అనుభవించి పునీతుడనయ్యేవరకు ఆచూపు నన్ను వదలదనుకుంటాను. కాని సముద్రుడు నారహస్యమును దాచడానికంగీకరించలేదు. మహాక్రోధంతో ఒక పెద్దతరంగం నన్ను అవతలికి గెంటేసి ఆపిల్లను నెమ్మదిగా ఒడ్డుకు చేర్చింది. నేనక్కడ ఇంకనిలబడ లేకపోయాను.

తిన్నగా నాకారు ఎక్కి వెయ్యిభూతములు ఆవహించినట్లు మనోవేగంతో వచ్చిపడ్డాను. అక్కడకూడా ఆగబుద్ధి పుట్టలేదు. ఆ తడిబట్టలు విడిచేసి పొడిబట్టలు కట్టుకొని మళ్ళీ కారులో కూర్చుని బయలుదేరాను. ఎక్కడికో నాకే తెలియదు. కారు ఏదారిని వెడుతోందో దారిలో ఏమున్నదో చూచుకోలేదు. మరొక్కరెవ్వరో నడుపుతున్నట్లుంది కాని నేనే నడుపుతున్నా ననుకోలేదు. కారుకి ఉన్న యావచ్ఛక్తి వినియోగించి ఉంటాను. సుమారు ఏడుగంట లయ్యేసరికి నాకు తెలియకుండా బెంగుళూరు చేరాను. తిన్నగా మన బంగళాకు వెళ్లాను. ఈ చెప్పకుండా రావడం నాముఖవైఖరీ చూచి నౌఖరులు ఆశ్చర్యపోయారు. నేను ఎవ్వరితోమాట్లాడకుండా తిన్నగా కారులోనుంచిదిగి పడకగదిలోకి వెళ్ళి కోటేనావిప్పకుండా పడుకున్నాను. నౌఖరు ఏదో అడిగాడు. నేను జవాబుచెప్పలేదు. ఇంక ప్రపంచమెరుగను. తరువాయి సంగతి నాకు జ్ఞాపకం ఉండిఉంటుంది. సుమా

రునెలరోజుల వరకూ వొళ్ళుతెలియని జ్వరం, స్మృతిలేక పోవడం, హటాత్తుగా తలంతా నెరవడం, డాక్టర్లు Brain fever అనుకోవడం, 20 రోజు లయిన తరువాత ప్రాణ భయంలేదని వైద్యులు నిర్ణయించడం, విరామంలేని పని వల్లా, తీవ్రాలోచనవల్లా (Nervous break down) వచ్చిందని అరుమాసములు విశ్రాంతి తీసుకొని దేశాటన చెయ్యమనడం అప్రకారం మనం తిరగడం నువ్వు ఎరిగు న్నదే. ఇదీ నేను చేసిన విరామంలేనిపనీ, తీవ్రాలో చనాను.

... .. ... ...

ఇంక నీతో చెప్పవలసిన దేమీలేదు. వప్పచెప్ప పలసిన ఆస్తి అంతకంటే లేదుకదా. నీదారినీవు చూచుకోవలసినదే. ..........నాకు జీవితంలో రెండే ఆదర్శాలు ఉండేవి. నేను విశేషంగా ధనార్జనచేసి, ఏదో మహెూన్నతపదవి పొందవలె నని; రెండవది, నిన్ను పురుషోత్తమునిగా చేసి నీకేదో మహా సామ్రాజ్యపట్టాభిషేకం చేయవలెనని. ఇందులో ఏదీకూడా చెయ్యలేక పోయాననేవిచారం కొంతకాలం ఉండేది, కాని ఇప్పుడదికూడాలేదు. వారి వారి జన్మాంతర సంస్కారమును బట్టి ఏవోకొన్ని సంకల్పములు గలగడమే కాని వాటి నిర్వ హణముమట్టుకు మనదికాదు. నేను ఆత్మహత్య చేసుకుం దామని నిశ్చయించి నప్పటినుంచి, నా అభిప్రాయాల్లో, దృక్పథంలో చాలా మార్పు వచ్చింది. మనం జీవితంలో ప్రధానమనుకున్నవనీ అప్రధానంగాను అప్రధానమను కున్నవన్నీ ప్రధానంగానూ కనుపిస్తున్నా యిప్పుడు.

సముద్రయానం చేసేటప్పుడు నావ ఒడ్డునుంచి దూరమైన కొద్ది నిత్యజీవనాని కత్యావసరమనుకున్న సమస్త పదార్థ

ములూ, రోడ్లు, బళ్ళు, ఇళ్ళు, వాకిళ్ళు, నదులు, పర్వత ములు సమస్తమూ మాయమై, పంచభూతములూ తప్ప మరేమీ గోచరించనట్లే నేను ఈ ప్రాణప్రయాణ సమయంలో ఇహపరముల మధ్యను నిలబడి ఒక్కసారి సింహావలోకనం చేస్తే వస్తుస్వరూపములూ, తత్వములూ, విలువలూ తారు మారై జీవితంలో మనకు కనపడే కృత్రిమాకారాలను విడిచి, నిజస్వరూపంతో నిజస్వభావంతో నిజస్థానంలో కనపడుతూ ఉంటాయి. అఖరుకు బ్రతికిఉన్నన్నాళ్లూ, వెర్రివాళ్లూ, అప్రయోజకులూ దేశవినాశనానికి కారకులూ అనుకున్న తత్త్వవేత్తలమాటే—సత్యం నిత్యం, అనుకున్నది. అసత్యం అనిత్యంగానూ, అనిత్యమూ అసత్యమూ, అనుకున్నవే నిత్యము సత్యముగాను కనుపిస్తోంది.

.... ... .... ....

నీకు తత్త్వోపదేశం చేదామని కాదు నా ఉద్దేశం, చేసినా నువ్వు వింటావనే నమ్మకంలేదు నాకు. నా ముందు నడచిన మహానుభావులమాట బ్రతికి ఉన్నన్నాళ్లూ నేను విన్నాను గనుకనా !

... .... .... ....

ఇదివరకెన్నడూ ఈ రహస్యములను ఎవ్వరితోటీ చెప్ప డానికి భయపడ్డాను. అందులోనూ ముఖ్యంగా నీతో చెప్పడాని కనలే సిగ్గుపడ్డాను. ఏతండ్రీ తనకన్నబిడ్డలయెదుట చులకన పడడానికి ఒప్పుకోదుకదా! ఇప్పుడు చెప్పకుండా ప్రాణం విడవలేకపోయాను. ఇంక నెవరేమనుకున్నా నాకు విచారం లేదు. ఈ తుచ్ఛప్రపంచంయొక్క దూషణ భూషణ తిర స్కారములు అందనిచోటికి పోతున్నాను. నేను ఉన్నస్థితిలో దారిద్ర్యాన్నిచూచి జాలిపడి చేతనైననసహాయం చెయ్యడానికి

బదులు, ధనమదాంధతచేత, ఆ దరిద్రుణ్ణి అధఃపాతాళానికి అణగద్రొక్కి వాడి చావుకి కారకుడిని అయ్యాను. ఈ దుష్ట ప్రపంచంలో అదృష్టము, అలభ్యమూ అయిన, అమాయి కత్వమూ, పవిత్రతా కనపడినప్పుడు గౌరవించి పూజించ డానికిబదులు, వాటిని చంపేసి నట్టేటిపాలు చేశాను. ఇంత కంటె, ఒక్కజీవితంలో దుర్మార్గం ఏమిచెయ్యాలి!

నాయనా! నీవు నన్నుగురించి ఏమనుకొన్నా సరే కాని నేచేసిన ఈమహాపరాధములు రెండుమట్టుకు జ్ఞాపకం పెట్టుకో. నేను అనుభవించినవాటి ఫలితం మరచిపోకు. ఆ అపరాధములు మట్టుకు నీవేనా నీ జన్మ మధ్యమందు చేయకూడదని నాతుదికోరిక...బహుశా నీ సమీపములో ఉండిచూస్తూ ఉంటాననుకుంటాను........ ..... వెళ్ళనా నాయనా! స మ యా ని కి దగ్గరేనాలేవుకదా!......ఇదే మంచిది.........

పార్థసారధినాయుడు ఉత్తరం అంటించేసి బల్లమీదపెట్టి లేచి ఒళ్లు విరుచుకొని కడసారి ఇల్లంతా తిరిగి, తోటలో ఒక్కసారి తిరిగివచ్చి, జేబులో మాత్రతీసి నోట్లోవేసుకుని కాసిని మంచినీళ్లుతాగి మంచంమీద పడుకున్నాడు.........

నా వింతజీవితంలో అనేక విచిత్ర విషయాలు విన్నాను; కన్నాను, అనేకమైన అద్భుత సంఘటనల్లో తటస్థంగానో, సాక్షిభూతంగానో కూడా ఉండడం సంభవించింది. కాని ఇప్పుడు చెప్పబోతున్నదిమట్టుకు చిత్రాతిచిత్రము. నిజమా! కలా! కల్లా! ఏమో ఏంచెప్పను. ఆమనిషి దగ్గరున్నంతసేపూ అతని మాటలు వింటున్నంతసేపూ నిజమేనని నమ్మాను. అతను చెప్పిన భయానక, విషాదగాథకూడా నిజమనే నా నమ్మకం. కాని ఆ మనిషి ? అక్కడే నాకు సందేహం. స్థూలంగా మనకు కనపడే పాంచభౌతిక శరీరంతో ఉన్న మనిషా? లేక ప్రేతో, భూతమో, పిశాచమా అంటే కానూ వచ్చును. ఇందులో ఏది అని గట్టిగానన్ను ప్రమాణంచేసి చెప్పమంటే నేను చెప్పలేను. ఆనాటినుంచీ నన్నూ ఆ సందేహం బాధిస్తూనే ఉంది. ఇప్పటికేం తేలలేదు, నా జీవితాంతంవరకూ తేలుతుందనే నమ్మకం కలగడంలేదు. పోనీ ఆ వ్యక్తి ఎవరైతే మనకేం! అతను చెప్పిన కథాంశం ప్రధానం. అదిమట్టుకు నిజం. ముమ్మాటికీ నిజం అని తోస్తుంది. నీ కెలా తెలుసును ? నువ్వుచూచావా అంటే, చెప్పలేను. నేను చూడలేదు. కాని కొన్ని విషయాలు విన్నప్పుడు మనలో ఒక అశరీరవాణి ఇది నిజమే? సందేహం లేదు. సందేహించకూడదు అని చెవులో హెూరెత్తి చెపుతుంది. ఈ మనిషి మీ తండ్రి, ఈమె మీతల్లిఅంటే అవుననో కాదనో విశ్వాసం ఎలా కలుగుతుందో అలాగే ఇదీననుకోండి.

మొన్న నీమధ్య పెద్ద తుపాను వస్తుందనుకున్నాం చూచారూ! తుపాను లేకుండా పెద్దగాలి రోజున్నరవర్షంతో తేలిపోయింది. ఆనాడు జరిగిన సంగతిది. ఆ క్రితం రాత్రంతా ఆకాశం చిల్లుపడ్డట్టు ఏకధారగా వర్షం. ఆ రోజు

కూడా మధ్యాహ్నం మూడు గంటలవరకూ తెరలు తెరలుగా, అంతులేని అగని దుఃఖంలాగ, కన్నీటి జడులులాగ వర్షం కురుస్తూనే ఉంది. మూడుగంటలయిన తరువాత శరీరా యాసంచేత దుఃఖోపశమన మయినట్లు, కొంచెం వర్షధారలు తగ్గి, తెరిపిచ్చింది. అయిదు గంటలవరకూ ఇంట్లోకూర్చుని, ఇంక వర్షంరాదని నిశ్చయం చేసుకొని, ఈ వర్షానంతరం పట్నం ఎలా ఉన్నదో చూదామని బయలుదేరాను. వీధిలోకి వచ్చి నెమ్మదిగా సముద్రం వైపుగా దారితీశాను. ఆకాశాన్ని ఇంకా కారుమేఘాలు కష్టపరంపరలులాగ తరుముకెడు తున్నాయి. పట్టణాన్నంతా ఒక బూడిదరంగు దుప్పటితో చుట్టిపెట్టినట్లు ఎటుచూచినా పొగమంచు కమ్మేసింది. పది గజాల దూరంలోకూడా మనిషి స్పష్టంగా కనపడడంలేదు. కారులూ, బళ్లూ, సినిమాలోలాగ, దెయ్యాలులా హఠాత్తుగా మన దృక్పథంలోకివచ్చి మాయమవుతున్నాయి. మెరీనా పేవుమెంటుమీద నిలబడి సముద్రంకేసి చూశాను. సముద్రపు ఘోష వినపడడమేకాని, సముద్రుని దర్శనంమట్టుకు కాలేదు. ఒడ్డునున్న ఇసుకమీద పల్లెవాళ్లు కాబోలు అస్ప ష్టంగా కలలో మనుష్యులులాగా ఇటూ అటూ తిరుగు తున్నారు. నేను అలాగే నిలబడి, ఈ వాస్తవికమనిపించే మిథ్యాజీవనం, దానిలోని వ్యర్థమైన కామక్రోధాలూ, రాగ ద్వేషాలూ మొదలైన వాటిని గురించి యోచిస్తూ, ఆశ్చర్య పోతూ, సత్యమైన అలౌకిక ప్రపంచానికి సోపానాలు ఎలా ఉంటే బాగుంటాయా అని ఊహాగానంచేస్తూ జాగ్రత్స్వప్న ములకు మధ్యనున్నట్టున్నాను. నన్నూ నా ప్రపంచాన్నీ కూడా మరచిఉన్న ఆస్థితిలో యముడి నిట్టూర్పులాంటి అతి శీతలవాయువొకటి నాకుసోకి, నా శరీరాన్నంతనీ ఒక్కసారి

ఝల్లుమనిపించింది. దానితో ఊహాప్రపంచంలోకి, ఒక్క సారిపైనుంచి ఎవరో తోసినట్టు, పడ్డాను, అప్రయత్నంగా పైనున్న ఖండువా దగ్గరగా కప్పుకుని, వెనక్కు తిరిగాను., అక్కడనుంచి కదులుదామని. కాని, వేళ్లుతన్నుకుపోయి నట్టు కదలలేకపోయాను.

నా వైపుకు ఒక మనిషి వస్తున్నాడు. ఇంతసేపటినుంచీ, ఎంతమంది నాపక్కనుంచి వెళ్లారో నేను గమనించలేదు. కాని ఈ మనిషి చూపుమేరలోకి రావడంతోనే, నేను దివా స్వప్నంలోనుంచి జాగ్రదవస్థలోకి వచ్చాననుకుంటాను. అతని సామీప్యమే నన్ను కదలనివ్వకుండా చేసిందనుకుంటాను. సన్నంగా పొడుగ్గా, గాలిలో తేలిపోతున్నట్టు నడుస్తూ వచ్చాడు. తలంతా రేగిపోయిఉంది. పెద్దగాలిదుమారంలో నడిచివచ్చినట్లు ముఖమంతా పీక్కుపోయి, అస్థిపంజరం మిద చాలీచాలక చర్మం తొడిగినట్టుంది. కళ్లుమట్టుకు రెండు చీకటిగుహల్లోనుంచి మెరుస్తున్న అగ్ని శిఖల్లా కన పడ్డవస్తువునల్లా దహించేట్టున్నాయి. అతని వయస్సు 40 సంవత్సరము లుండవచ్చు లేదా 20 కంటె ఎక్కువలేవన్నా నమ్మవచ్చు. శరీరంలో రక్త, మజ్జ, మాంసాదులున్నాయా లేవా అంటే లేనట్టే అనుమానం. అందుకనే ఆవ్యక్తి సజీవు డైన మనిషా లేక దెయ్యమో భూతమేనా అంటే యదార్థం చెప్పలేకపోవడం. ఆ మనిషి దగ్గరకు వచ్చినకొద్దీ, ఒక విధ మైన భయంకలిగింది. ఒక విదమైన ఆకర్షణా ఏర్పడ్డది. ఆ మనిషినుంచి దూరంగా తొలగిపోదామనిపించలేదు. అంత కంతకు దగ్గరగా వెళ్లుదామనిపించింది. కాని అతనే నెమ్మ దిగా గాలికెరటంమీద వచ్చినట్లు తిన్నగా నాదగ్గరకు వచ్చాడు. మళ్ళీ ఒకసారి నా శరీరం కంపించింది, ఇతను

మామూలు మనిషికాడనే అనుమానం నాకు అప్పుడే కలిగింది. త్వరగా ఇంటికి పోవాలనిపించింది. కాని కదల్లేక పోయాను. కణకణలాడే విస్ఫులింగములలాంటి కళ్లతో ఒక్కసారి నా కళ్లలోకి చూచాడు. అచూపుతో నా పంచ ప్రాణాలనూ గాలంవేసి లాగినట్టులాగి తన దారిని తను నడవసాగాడు. నా శక్తి నాస్వేచ్ఛ యావత్తూ పోయినాయి. నేను అప్రయత్నంగా అయిష్టంగా అతని వెనకాలే నడిచాను. కొంతదూరంసాగి నిర్జనంగా ఉన్నచోట, పేవుమెంటుమీద నుంచి ఇసుకమీదకు నడిచాడు. వెనకనే నేనూ దిగాను. నేను వస్తున్నానాలేదా అనిమట్టుకు అతను వెనక్కు తిరిగి చూడ లేదు. కాని నేను వస్తున్నానని అతనికి తెలుసుననుకుంటాను. నాలుగడుగులువేసి అతను ఇసుకమీదనే కూర్చున్నాడు. నేనూ కూర్చున్నాను అతని కెదురుగా. కొన్ని నిముషాల వరకూ ఏమీ మాటలాడలేదు, అంతసేపూ నాకు భయంవేసే టట్లు నాకేసికాదు. నాలోనుంచి ఎక్కడికోచూస్తున్నాడు, అతని కళ్ళలో ఎక్కడివో, ఎంతదూరాన్ని ఉప్పెట్టు అగ్ని జ్వాలలు కనపడ్డాయి. ఆకాశం మరీ కాఱు కమ్ముకుపోయింది. మాచుట్టూఉన్న చేతనా ప్రపంచమంతా స్తంభించిపోయింది. సముద్రఘోషలో ఎక్కడివో భయంకరమైన రోదనలు విన పడ్డాయి. గాలిలో శ్మశానవాసనలు మానాసికలకు సోకినాయి. ప్రపంచమంతాపోయి మే మిద్దరమే మిగిలినట్లనుపించింది. అతని కళ్ళవెంట కన్నీళ్లుకారడం మొదలు పెట్టినాయి.

భయంతో, గద్గదికతో 'ఏమండీ! విఛారిస్తున్నారు విచారించకండి. మీ కభ్యంతరం లేకపోతే నాతో చెప్పండి. కొంత బరువు తగ్గుతుందేమో' అన్నాను.

ఉప్పెనలా పొంగివస్తున్న దుఃఖాన్ని నెమ్మదిగా అపుకుని

'చెపుతాను నాయనా. చెపుదామనే వచ్చాను. చెప్పాలి, అందరి తోనూ చెప్పాలి. దాచి లాభంలేదు. చెపుతాను!' అన్నాడు. అని నెమ్మదిగా తనకథ ప్రారంభించాడు.

౨

తరుచుగా మనలో చాలామందికి అనవసరమైన విషయాలనుగురించి, అసాధ్యమైన ఆదర్శాలను గురించి, అర్థంలేని తత్త్వాన్నిగురించి తేలికగా మాట్లాడుతూ ఉండడం అలవాటు. కాని మధ్యమధ్యను అప్రయత్నంగా ఈ వ్యర్థ సంభాషణలోనే మనకు తెలియకుండానే సన్నిహిత సంఘటనలు కొన్ని మన సంభాషణను రాజకీయ సిద్ధాంతాలవైపో, జీవితాదర్శంవైపో, అహింసా సిద్ధాంతంవైపో, సత్యసాధనవైపో తిప్పినడిపిస్తాయి. నేనూ రాజారావు—అన్నట్టు రాజారావును మీరెరుగరుకాదూ! మొదటినుంచీ చెపుతాను. రాజారావూ నేనూకూడా ఈ ప్రాంతాలవాళ్ళమేకాని చిన్నప్పటినుంచీ ఉత్తరదేశంలోనే చదువుకుని కలకత్తాలో ఒక పెద్ద కంపెనీలో చాలాకాలంనుంచి పనిచేస్తున్నాం. నెలరోజులు శలవు తీసుకుని ఇక్కడ పనుల్ను చక్కపెట్టుకోడానికివచ్చాం. రాజారావుభార్యా. తల్లీ, తండ్రీ అంతా కలకత్తాలోనేఉన్నారు. నాకు తల్లీ తండ్రీలేదు. భార్య ఈప్రాంతాలనే పుట్టింటికి వచ్చింది. నేను నాభార్యనూ, రాజారావు తన సోదరినీ తీసుకుని కలకత్తా వెళ్ళవలెనని సంకల్పించుకుని మదరాసునుంచి బయలుదేరాం. మాలో ఎవ్వరికీ శకునాలన్నా సూచనలన్నా నమ్మకంలేదు. మేము ప్రయాణం పెట్టుకున్నరోజు మంచిదికాదనీ, మరొక్కనెలరోజులు కూతుర్ని ఇక్కడనే

ఉంచమనీ మా అత్తగారు చాలా బలవంతపెట్టారు. 'ఏమం టావు?' అని నాభార్య నడిగాను. అదివరదాకా ఉత్సాహంగా ప్రయాణమైనమనిషి కొంచెం మెల్లగా 'మీఇష్టం' అంది. నాకు చాలా తొందరపని ఉన్నది. నేను వెళ్ళక తప్ప దన్నాను' 'అయితే నేనూ వస్తానన్నది' 'మీ అమ్మగారు అలా అంటున్నారు. నీకూ ఏదో కొన్నాళ్ళు ఇంకా ఉండవలెననే ఉన్నట్టుంది...' 'అబ్బే, లేదు, ఏంలేదు, మనస్సులో ఏదో ఆందోళన, భయం బయలుదేరింది హఠాత్తుగాను! కారణం ఏంలేదు, ఫరవాలేదు. వెడదాం. మీరొక్కరూ ఇంకా ఎన్నాళ్ళు ఇబ్బంది పడతారు, నాకుమట్టు కిక్కడేం తోస్తుంది....ఎప్పుడూ ఇలా లేదు. ఎందుచేత నింతభయం... ఏదో అజీర్తో, పైత్యమో...ఫరవాలేదులెద్దురూ అదే సర్దు కుంటుంది. మీరు వెళ్ళక తప్పదంటే నేను ఉండలేను. అనుకున్న ప్రయాణం ఆపడమెందుకు—నడవండి' అన్నది. కాని ప్రతిమాటలోనూ ఏదో వెనక్కిలాగుతున్నట్టే తోచింది. 'అయితే ఈపూట ప్రయాణమే' నన్నాను.

మళ్ళీ ఒకసారి రాజారావుదగ్గరకెళ్ళాను త్వరగా బయలు దేరమని చెప్పడానికి. 'ఏంరాజా! ఇంకా నిస్త్రాణగా అలా కూర్చున్నావేమిటి? ఇంక నట్టేవ్యవధిలేదు. త్వరగా డబ్బా డవాలీ సర్దు' అంటూ లోపలికెళ్ళాను. రాజారావు ఏదో పరా కుగా ఎక్కడో చూస్తూఉన్నట్టుగా కూర్చున్నాడు. ఒక్క క్షణం నాకు సమాధానం చెప్పలేదు. 'వెడదామరెటావా' అన్నాడు పెద్దనిట్టూర్పుతో...'అదేమి'అన్నా....'ఏంలేదు ఏదో నాకు మతిపోతోంది. ఏదో మహాప్రళయం వస్తోన్నట్టు భయం కరమైన గర్జనలూ రోదనలూ వినపడుతున్నాయి. పెద్ద యుద్ధం జరుగుతోన్నట్టు దృశ్యాలు నాకళ్ళకు కట్టినట్లు కను

పిస్తున్నాయి. ఏవో ఆర్తనాదాలు, గర్భనిర్భేదకంగా నా చెవు లల్లో హోరెత్తుతున్నాయి... ఏమంటావు ఇదంతాను. నాకు అదోవిధమైన భయంగా ఉంది.' అన్నాడు. 'అయితేపోనీ ప్రయాణం మానేద్దామా. మాఆవిడా కొంచెం సందేహిస్తోంది. అన్నాను. 'అలాగా—అయినా సరే, మనం వెళ్ళకతప్పదు వెళ్ళాలి. నేను అక్కడ ఉండితీరాలి. అనేకవేల గొంతుకలు నన్ను పిలుస్తున్నాయి. అనేకవేల చేతులు నాకేసి చాపి ఉన్నాయి—ఇదేదో—కాదులే వెళ్ళాలి. వెడదాం' అని లేచాడు ఉద్రేకంతో.

నేను ఇంటికొచ్చాను. నాకేమిటో అంతా అయోమయంగా ఉన్నదీ. నేను మామూలు మనిషిని. నాలో ఏవిధమైన సున్నితాలూలేవు. కవిత్వాలూ, ధ్వనులూ నాకర్థంకావు. కాని రాజారావు, అతిసుకుమారి—రూపంలోనూ, మనస్సు లోనూ, హృదయంలోనూ కూడాను. ఎక్కడో జరుగు తున్నది అతను ప్రత్యక్షంగా చూస్తున్నట్టు చెపుతా డొక్కొక్క ప్పుడు. ముందురాబోయేవీ జరగబోయేవీ ఒక్కొక్కప్పు డతనికి తెలుస్తాయి. అతనిది Psychic nature అనీ experiments కు మంచి subject అనీ కొందరు అనగా విన్నాను. అందుచేతను అతనిలా అన్నాడంటే నాకూ ఏదో కొంత అనుమానం కలిగింది. అయినాసరే అనుకుని కలకత్తామెయిలుకు రెండుగంటలు ముందుగానే బయలుదేరాం—సామాను బండిలోపెట్టి మేమాబండిలో కూర్చుని పోనివ్వ మనేసరికి కట్టెలబండి ఒకటి ఎదురుగా వచ్చింది. బండి ఆపి మా ఆవిడ ఒకమాటు లోపలికి వెళ్ళి కాళ్ళు కడుక్కొని మళ్ళీవచ్చింది. మా అత్తగారు వచ్చే దుఃఖాన్ని అపుకుని కళ్ళు వొత్తుకుంటూ నిలబడ్డది. తిన్నగా

రాజారావింటికి వచ్చాం. వాళ్ళూ వీధిలోకి అప్పుడేవచ్చి బండి ఎక్కుతున్నారు— మారెండు బళ్ళూ బయలుదేరి పదిగజాలన్నా సాగకముందు, మా ఎదట భయంకరమైన ప్రమాదం జరిగింది. ఒక లారీవచ్చి రిక్షాను ఢీకొట్టింది. రిక్షాలో ఉన్న మహమ్మదీయ స్త్రీ కెవ్వుమని కిందపడింది. వెంటనే ప్రాణంపోయి ఉండాలె. హాహాకారాలు, జనసమూహం, కేకలూ—మాదారిని మేం వెళ్ళిపోయాం. అది పదహారో అగష్టు.

మేం వచ్చేసరికే రైలు సమ్మర్దంగా ఉంది. మేం ఇంటరు క్లాసులో నెమ్మదిగా ఎలాగో ప్రవేశించాం. ఒక యుగంగా గడచిన గంటతరువాత రైలుబయలుదేరింది. ఒక్కక్షణాని కల్లా గభీమని ఆగింది. విచారించగా పడిగట్టుమీదనున్న కుర్రవాడెవరో క్రిందపడ్డాడని తెలిసింది. వెంటనే ఆసుపత్రికి తీసుకు వెళ్ళారు. పాపం ఏమయ్యాడో తెలియదు. పదినిమిషాలు తరువాత మళ్ళీ దుఃఖంతో బయలుదేరినట్లు బలువుగా బయలుదేరిందిరైలు.

సుమారు ఎన్నూరు దాటేవరకూ పెట్టెలో గందరగోళం తగ్గలేదు. నెమ్మదిగా, నయాన్నీ, భయాన్నీ, కొంతచోటు సంపాదించి కూర్చున్నాం. మాలో ఎవ్వరికీ మనస్సులో ఉత్సాహంగా లేదు. ఎవరికీ మాట్లాడాలనిలేదు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగి తేలుతున్నాం. ఒక్కక్షణంలా గడచినకాలంలో సూళూరుపేట చేరాం. మళ్ళీ గందరగోళం, తిండికి పరుగులు, మళ్ళీ పావుగంటలో అంతా యధాస్థానాలు చేరుకున్నారు. మళ్లీరైలు బయలుదేరింది.

'కలకత్తాలో మతకలహాలు బయలుదేరాయట' అన్నాడు ఒకాయన పేపరుచేతపుచ్చుకుని. అందరిచూపులూ, చెవులూ

ఆయనమీదకెళ్ళి చుట్టవేసినాయి. ఇవాళ ముస్లింలీగువారి Direct action Day గనుక కలకత్తాలో అన్నిఆఫీసులకూ శలవు ఇచ్చారనీ, దుకాణాలన్నీ బలవంతాన మూయించారనీ, అలా అంగీకరించని దుకాణదారులను చావమోది, వారిదుకాణాలను కొల్లగొట్టి కొన్నిటిని తగలపెట్టారనీ, ఇంకా ఏవేవో చదువుతున్నాడు. మాకాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. మేము కూర్చున్నచోటునుంచి కదలలేదు. మాచెవులు పత్రిక చదివేవారి దగ్గరున్నాయి. మా హృదయాలు కలకత్తాలో ఊరికాయి. మామనస్సులలో మహాసంక్షోభం బయలుదేరింది. ఎవరికీ ఏమనడానికీ తోచలేదు.

అలా ఎంతసేపు కూర్చున్నామో తెలియదు. రైలు చీమ గంగాయాత్రలా నెమ్మదిగా పాకుతోన్నట్టనిపించింది. కొన్ని వేలక్షతగాత్రుల హాహాకారాలులా రైలుహోరు మాచెవులలో హోరెత్తుతోంది.

'మహ చెడ్డవారుణంగా ఉంది' అన్నాడు ఒకతను పక్క మీదసావకాశంగా పడుకుంటూ.

'ఈ జిన్నాగాడి కిదేం పోయ్యేకాలం' అన్నాడు మరొకడు సిగరెట్టు పీలుస్తూ.

'అబ్బే వాళ్ళను దేశంలోనుంచి తరిమేస్తేనేకాని లాభం లేదు' మరొకాయన.

'తరిమెయ్యడమేమిటి. నల్లిని నలిపినట్టు నలిపి పారెయ్యాలి' అన్నాడో పరాక్రమశాలి.

'అహింసనుకుంటూ ఈ గాంధీ ఒకడు మనకి....' అని వినుక్కున్నాడొకాయన, తనేదో ప్రతీకారం చేయబోతున్నట్టూ గాంధీవచ్చి తనచెయ్యి పట్టుకున్నట్టూను.

'ఈ కాంగ్రెసువాళ్ళు కొని తెచ్చుకున్నారు' అన్నాడు ఒక కమ్యూనిస్టు. అతనినోటంట మాటరావడం తడవుగా నలు గురూ అందుకున్నారు.

'కాంగ్రెసు కొని తెచ్చుకోవడమేమిటి'

'వాళ్ళందరినీ చంపమన్నారుటయ్యా...'

'వీళ్ళేమైనా పల్లెత్తుమాటన్నారూ వాళ్ళని'

'నీలాంటివాళ్లుండబట్టేదేశం ఇలా అఘోరిస్తోంది.'

'మాటలుసరిగ్గా రానియ్యి'

'ఏంచేస్తావేం'...

'ఈమాటు మళ్ళీ కుయ్యి'...

'ఓమాటుకాదు లక్షమాట్లంటా. అబ్బో ఈమాత్రం వానికే భయపడతాననుకున్నావా'...

'అంతధైర్యశాలివి కలకత్తా పోరాదూ'

'వెళ్ళనామరీ. నీకుమల్లే దొంగతనంగా తప్పించుకు తిరిగేవాళ్ళంకాదు'...

ఈ ధోరణి బాగుందికాదని సంభాషణ మార్చడానికి 'అహింస మంచిదేకాని, ఇప్పుడు గాంధీగారేమంటారో' అన్నా డొకాయన.

'ఆయన ఎప్పుడు చెప్పినా ఒక్కటే. మంచివల్ల చెడు నశిస్తుందంటాడు'...

'కాని ఇలాటప్పుడు ఇలాటి అత్యాచారాలు జరుగుతుంటే ఎలాచూస్తూ ఊరుకోడం'...

'ఇలాటప్పుడు కాకపోతే నీ అహింస మరెప్పుడు... ఇది పరీక్షాసమయం. పరీక్షకాగలేకపోతే దాని ప్రయోజన మేముం టుంది'

'నిజమేననుకో. కాని, నీ కళ్ళ ఎదుట నీ భార్యనో, తల్లినో

మానభంగంచేసి ప్రాణం తీస్తుంటే చూస్తూ ఊరుకోడం అహింసా పిరికితనమా....'

'చూస్తూ ఊరుకోమని ఎవరన్నారు. ఊరుకుంటే పిరికితనమే!

'మరేం చెయ్యమంటావు'....

'అయినా గాంధీగారేమంటారో .... ఆయనేదో ఒకదారి చూపిస్తే బాగుండును'...

'చూపిస్తాడు. ఎలాగూ చూపిస్తాడు కాని ఎంతకాలం ఆయనమీద ఆధారపడడం, ఒక మహానుభావుడు ఒకసిద్ధాంతాన్ని మనకు చెప్పినప్పుడు దాన్ని ఆచరణలో పెట్టవలసిన బాధ్యత మనది. ఏ పరిస్థితులలో ఎలా సరిపెట్టుకోవాలో నిర్ణయించుకోవలసినబాధ్యత మనది' అన్నాడు పిడుగులా రాజారావు. అంతవరకూ మేము సంభాషణలో కలగచేసుకోలేదు. కలగచేసుకోవలెనని అనుకోలేదుకూడాను. మా మనస్సులలో బయలుదేరిన తుపానులనే ఆపుకోలేకుండా ఉన్నాం. ఈ మాట అనడంలో రాజారావు ఇంతసేపటి నుంచీ ఆలోచిస్తూ ఏదో నిశ్చయానికి వచ్చినవాడికి మల్లే మాట్లాడాడు. మేమంతా తెల్లపోయాం.

'నిజమేనండి....కాని ఇలాటప్పుడు....ఎలా;ఏం చెయ్యడం; ఏమీ చెయ్యకుండా ఊరుకోడం ఎలాగ. ఇంతదారుణం ఎక్కడేనా ఉంటుందండీ' అన్నాడు భయపడుతూ ఆ పెద్దమనిషెవరో...

'ఊరుకోమని ఎవరన్నారు, ఊరుకోకండి. చేతనైతే వెళ్ళి ఆపండి' అన్నాడు రాజారావు.

'ఆపడమా! ఎవరాపగలరు ఆ రాక్షసులని. అందులో అహింస ఒకటాయెను...'

'ఏమీ! తలచుకుంటే ఎందుకాపలేరు. కాని మనం ఇక్కడనుంచి కదలం. మీనమేషాలు లెక్కపెడుతూ ఇక్కడే కూచుంటాం. ఎక్కడో ఎవళ్లో చస్తే మనకేం మన సిగరెట్లూ, మన కాఫీలూ, మన భార్యలూ ఉంటే చాలు... మనకు ఆత్మగౌరవం ఏనాడో చచ్చింది. అన్నివేలమంది హిందూస్త్రీలకు మానభంగం అవుతుంటే మనంకనక ఊరుకున్నాం కాని మరే జాతివాడూ ఊరుకోడు. మనం ఇలా ఊరుకుంటామని తెలిసేవాళ్ళు చెలరేగడమున్నూ. ఇక్కడ హాయిగా కడుపులో నీళ్ళు కదలకుండా కూర్చుని హింసా అహింసా అని తర్కించుకుంటూ మన మాంద్యానికే అశక్తతకే బాధ్యత ఎవరినెత్తిని తోద్దామా అని ఆలోచిస్తాం' అన్నాడు రాజారావు గుక్కతిప్పుకోకుండాను. తక్కినవాళ్ళ సంభాషణలు కట్టిపెట్టి, అంతా మావాడికేసి చూచారు.

'మీరుమట్టు కేం చేస్తారేం' అన్నాడాయనెవరో. 'ఏం చేస్తానా-వాడి దౌర్జన్యాన్ని శాయశక్తులా అపడానికి ప్రయత్నిస్తాను. ఆ ప్రయత్నంలో నాప్రాణమయినా ఒడ్డుకుంటాను. మా ఆడవాళ్ళమీదకు పొచ్చిపడితే మావాళ్ళని నాముందు నా చేత్తోటే కడతేరుస్తాను. వాళ్ళచేతుల్లోమట్టుకు పడనివ్వను. ఇంకాఅవసరమయితే వాడినీ చంపుతాను'అన్నాడు రాజారావు. అతని నోటివెంట ప్రతీమాటా మరఫిరంగిలోనుంచి వచ్చే గుండులా వచ్చి మాకు తగిలింది. అతని ముఖం వర్షాకాల సూర్యాస్తమయంలా ఉంది. అతని కళ్ళు దివ్యజ్యోతుల్లా వెలుగుతున్నాయి. మాకందరకూ భయంవేసింది. అతను అవసరమయితే అంతపనీ చేస్తాడనేనమ్మకం మాకు కలిగింది.

ఇలా ప్రతిస్టేషనులోనూ ఎక్కేవాళ్లూ దిగేవాళ్ళూ, ఈవిషయాన్ని గురించే వాదోపవాదాలూను. వాల్తేరులో ఇంకా

భయంకరంగా చెప్పుకున్నారు. బరంపురం చేరేసరికి గుండెలాగి పోయినాయి. కాని మాలో ఆడవాళ్ళకు కాని మగవాళ్ళకు కాని వెనక్కుపోదామని అనిపించలేదు. మాలో ఒక్కళ్ళకూ మళ్ళీ ఒకళ్ళనొకళ్ళం కలుసుకుంటామని కాని మళ్ళీ మనదేశం చేరుకుంటామని కాని నమ్మకం కించిత్తు కూడాలేదు. అయినా ఏదో అతీంద్రియమయినశక్తి మమ్మల్ని ముందుకు లాక్కుపోయింది... ఏలాగో కలకత్తా చేరుకున్నాం.

అక్కడ స్టేషనులో దృశ్యం వర్ణించడానికి శక్యంకాదు. దెబ్బలు తిన్నవాళ్ళు, కత్తిపోట్లు తిన్నవాళ్లు, పట్టణం విడిచి పారిపోయేవాళ్ళు, వయసువారు, ముసలివారు, బాలురు, స్త్రీలు...ఎన్నివేలమందో స్టేషనులో ఇసుకవేస్తే రాలకుండా ఉన్నారు. ఆ దృశ్యంచూస్తేనే పట్నం ఏపరిస్థితులలో ఉన్నదో అర్ధమయింది. ఎవ్వరినీ అడగకుండానే...ఊళ్లోకి ఎవ్వళ్ళూ బళ్ళుకట్టమన్నారు. కార్లుకూడా ఏమీదొరకలేదు. మేము సామాను అక్కడే పడేశాం. అదేమవుతుందన్న ఆలోచనే మాకు కలగలేదు. తిన్నగా ఊళ్ళోకి బయలుదేరాం. వద్దని చాలామంది వారించారు. ఆగమని బలవంతపెట్టారు. అక్కడున్న ఆడవాళ్ళు మావాళ్ళను కౌగలించుకుని వెళ్ళవద్దని ఏడ్చారు. మేమూ మావాళ్ళని అక్కడ ఉండమన్నాం. వాళ్లు ఉండమని మా వెంటబయలుదేరారు.

కలకత్తావీధుల్లో అహర్నిశాదు లెప్పుడూ సాధారణంగా తెరిపి ఉండదు. ఎప్పుడూ జనం తిరుగుతూనే ఉంటారు. అలాటిది ఆనాడు వీధులన్నీ నిర్జనంగా ఉన్నాయి. బళ్లూ కార్లూకూడా అట్టే తిరగడంలేదు. అప్పుడో ట్రామూ అప్పుడో ట్రామూ హడలిపోతూ వస్తోంది. చాలాదుకాణాల తలు

పులు బద్దలకొట్టి ఉన్నాయి. లోపల సరుకుపోగా మిగిలినది చెల్లాచెదరుగా ఉన్నది. అక్కడక్కడ కొన్ని కాలిన ఇళ్లు ఇంకా కాలుతూనే ఉన్నాయి. రోడ్లమీద అక్కడక్కడ శవాలు పడిఉన్నాయి. మేము మహాశ్మశానంలో నడుస్తున్నా మనిపించింది. మమ్మల్ని చూచినవాళ్లు ఆశ్చర్యపోయారు మా మొండితనానికి. మేమూ అరిచేతుల్లో ప్రాణాలుపెట్టు కుని రాజమార్గాలు తప్పించి సందులా గొందులా పడి మా వీధి చేరుకున్నాం. మా వీధిచివర పెద్ద మిఠాయిదుకాణం ఎప్పుడూ తెరిచి ఉండేది. ఎప్పుడూ ఎంతోమంది అక్కడ కొనుక్కుపోతుండేవారు. ఇవాళ ఎవరూలేరు. అలాగే అన్నీ మూయబడో బద్దలకొట్టబడో ఉన్నాయి దుకాణాలు. మా వీధిలోకి వెళ్ళుతుండగానే కొందరు తురకలు కత్తులుచ్చు కుని కేకలేసుకుంటూ మావేపు పరుగెత్తుకొచ్చారు. మేము ఒక్కపరుగున మాగుమ్మంలోకి ఉరికాం. తలుపు వెయ్య బోతున్నాం నలుగురు తురకలు తలుపుతోసుకుని లోపల పడ్డారు. మాకందరకూ ఒళ్లుచల్లపడి రక్తం గడ్డకట్టినట్లై పోయింది. లోపల అంతా నిర్జనంగావుంది. మాకు పది అడుగుల దూరంలో రాజారావు తండ్రి చనిపోయి ఉన్నాడు. ఆయనవైపు చూస్తే చాలా ఘోరమైన దెబ్బలాట జరిగిఉండ వలెనని అనిపించింది. అతనిమీదనే ఒకసాయబుశవం పడి ఉంది. ఇంకొంచెము అవతలగా రాజారావు తల్లిశవం ఉన్నది. ఆత్మహత్య చేసుకున్నట్లుంది. మేము ఆలోచించ డానికి ఆశవాలను పరీక్షించడానికి వ్యవధిలేక పోయింది. లోపలికివచ్చిన ముసిలిములు మమ్మల్ని ముట్టడించారు. ఇద్దరు మా ఆడవాళ్ళమీదకు దూకారు. నేనూ రాజారావు అడ్డుపడ్డాం. తక్కిన వాళ్ళిద్దరూకూడా వచ్చి మామీద

పడ్డారు. ఆడవాళ్లు గొల్లుమన్నారు. ఏం ప్రయోజనం ఆ అరణ్యరోదనం ఎవరికి వినపడుతుంది. ఎవరువచ్చి అడ్డు పడతారు. వాళ్లు కెవ్వుమనగానే ఒకముస్లిము వాళ్ళమీద కెళ్ళాడు. మేము ఇంకా ఎక్కువగా కుస్తీపట్టాం. ఇంతలో హఠాత్తుగా నావీపుమీద బాకుతో ఒకడు పొడిచాడు. 'అబ్బా' అని నేను ముందుకుపడ్డాను. నేను కదతేరాననుకుని ముసిలిములు ముగ్గురూ రాజారావుతో యుద్ధం ప్రారంభించారు. రాజారావు ఒక్కసారి దెబ్బలాటలోనే నాకేసి చూశాడు. నేను కదలలేక పోయాను కాని స్మారకం తప్పిపోలేదు. రాజారావు అభిమన్యుడులా, సవ్యసాచిలా దెబ్బలాడుతున్నాడు. చూస్తుంటే ఆశ్చర్యంవేసింది ఇంతశక్తి ఇతని కెలావచ్చిందని. అవతల అడవాళ్ళిద్దరూ కలిసి వాళ్ళమీదకు వచ్చిన మహమ్మదీయునితో దెబ్బలాడుతున్నారు. ఆపేచీలో ఎలాగో ఆతురక చేతులో కత్తిజారి నేలమీదపడింది. మెరుపులా నాభార్య ఎలాగో తప్పించుకుని ఆకత్తిని తీసి వాడిని పొడిచింది. వాడు కిందపడ్డాడు. సెబాష్ అన్నాడు రాజారావు. అంతా ఒక్క రెప్పపాటులో జరిగింది. రాజారావుతో దెబ్బలాడుతున్న వాళ్లు ఇదిచూచి ఇద్దరు అమాంతం ఆడవాళ్ళమీదికెళ్ళి వెంటనే నాభార్యను పొడిచేశారు. 'శివశివా' అని అవిడ ప్రాణాలు విడిచింది. రెండోవాడు రాజారావు చెల్లెలిని పట్టుకుని బలాత్కరించబోతున్నాడు. రాజారావు ఒక్క ఊపులో తనను పట్టుకున్న వాడిని విదిల్చి పారేసి వాళ్ళమీదకురికి వాడిని చంపాడు. మిగతా వాళ్ళు ఒకడు తనమీదకొచ్చాడు. రెండోవాడు ఆతని చెల్లెలిమీద కెళ్లాడు. ఆ అమ్మాయి చటుక్కున పమిటకొంగుతో మెడకు ఉరిపోసుకుని ప్రాణం విడిచింది. చేతులో చిక్కిన ఇద్దరు

ఆడవాళ్లూకూడా దక్కలేదుకదా అనేకోపంతో ఆ సాయిబు
లలో ఒకడు ఆ అమ్మాయిని-చనిపోయిన దానిరొమ్ములు....
అబ్బ-దారుణమయిన అత్యాచారాలు చెయ్యబోయాడు. ఎలా
తప్పించుకున్నాడో మళ్ళీ రాజారావు తప్పించుకుని వాడి
నొక్కపోటు పొడిచాడు. వాడు చచ్చాడు. ఇంతలో నాలుగో
వాడు వచ్చి రాజారావును చంపాడు. ఆడవాళ్ళమెళ్ళో వస్తు
వులు తీసుకున్నాడు. వాళ్ళమీద మూత్రవిసర్జనం చేశాడు.
వెడుతూ నన్నొకతాపు తన్ని చక్కాపోయాడు. ఈ గాథంతా
విద్యుద్వేగంతో జరిగి పోయింది.

ఇంక నేం చెప్పను. ఆ తురకల దౌర్జన్యం తలుచుకుంటే
నఖశిఖపర్యంతం మండిపోతుంది. ఎందుకు వాళ్ళకు మన
మీద నింతకోపం. వాళ్ళకు ఏమి అపకారం చేశాం. దారిన
పోయే ఆడవాళ్లను మానభంగం చెయ్యమనీ నిర్హేతుకంగా
నిరపరాధులను చంపమనీ ఏ ధర్మశాస్త్రం చెపుతుంది.
ఏ మతప్రవక్త బోధించాడు. దానివల్ల వాళ్ళు సాధించేదేమిటి
.......నేను మందుడను. వాటికేమీ సమాధానాలు నాకు
తోచడంలేదు. కాని ఆ వీరవనితలను తలచుకుంటే స్త్రీ
జాతిలో పరమేశ్వరి ప్రత్యక్షమవుతోంది. మా రాజారావు
పరాక్రమం తలుచుకుంటే లయకారుడు రుద్రుడు ప్రత్యక్ష
మవుతాడు. అతను పోయినందుకు నేను విచారించడంలేదు.
తలుచుకుని గర్వపడుతున్నాను. కాని తురకలొస్తున్నారని
విని, ఇళ్ళూ వాకిళ్ళూ, భార్యలూ, బిడ్డలూ సమస్తం విడిచి
పారిపోతున్న పిరికిపందలను చూచి సిగ్గుపడుతున్నాను.
ఎక్కడో జరిగినది, మనకేం అనుకుంటూ, రేపు తమమీదకూ
రావచ్చునన్నసంగతి గ్రహించకుండా, తమజాతి స్త్రీలకుజరిగే
మానభంగాలుకూడా మరచిపోయి, హాయిగా నిశ్చింతంగా

తిరిగే... ఏమనను అని వలవల ఏడిచాడు.

నాకూ పట్టరాని దుఃఖం వచ్చింది. నేనెక్కడున్నదీ మరచి పోయాను. నా వంట్లో రక్తం ఉడికిపోతోంది. నా ఎదుట తెర మీద నాటకంలా, అంతకంటె స్థూలంగానే కలకత్తా దురంతాలు కొన్ని కనపడ్డాయి. దూరశ్రవణ దూరదర్శనాలలో కాని, Fourth dimension లో కాని మాకు నమ్మకం లేదు. కాని అనాడు నాకు ప్రత్యక్షమయిన దృశ్యం భావనా చిత్రం అని వప్పుకోలేను. రేడియో మాటలులా వినపడు తున్న ఆ అపరిచితుని మాటలు కొంతసేపటికీ వినపడడం మానేశాయి. కలకత్తాలో మనుష్యులు పరుగెడుతున్న చప్పుళ్ళూ, కత్తులు ఝుళిపింపులూ, అర్తుల రోదనలూ మాత్రం వినిపించాయి. క్రమేణా అవికూడా Fade out అయిపోయాయి. నేనుమాత్రం కొయ్యబారిపోయి అలాగే కొంతసేపు కూర్చున్నాను. సముద్రం నన్ను పరామర్శిస్తు న్నట్లు నెమ్మదిగా రోదించింది. కలకత్తా దురంతాలకు కన్నీరు కారుస్తున్నట్లు హఠాత్తుగా వర్షం ప్రారంభించింది. నేను జాగ్రదవస్థకు వచ్చాను. నా ఎదట ఎవ్వరూలేరు.

నేను విన్నదంతా కలా, నిజమా? ఏమో!

## ౧

జీవితంలో వచ్చే ప్రతికష్టానికీ, సుఖానికీ మనకు తెలిసినా తెలియకపోయినా ఏదో కారణం ఉండి తీరుతుంది కదా. ఒకప్పుడు మహాపద ఏదేనా వచ్చినా, ఒకప్పుడు మహా సంతోషం ఏదేనా కలిగినా దానికీ దీనికీ కారణం జన్మాంతర దుష్కృతమో, సుకృతమో అనుకుంటాము. జన్మాంతరం దాకా అవసరం లేదంటాను. కొన్ని సంవత్సరముల జీవితం మనం తిరగేసి చూచుకుంటే, కారణం అక్కడే వుంటుంది. అది అతిస్వల్పమైన విషయం కావచ్చు. అప్పుడు మనం దాన్ని లెక్కచేసి ఉండకపోవచ్చు. ఆ కారణంచేత అదిచేసే పని అది మానదుకదా.

మా సాంబశివుడి చావుకుమట్టుకు ఆరోజున మేము వెళ్లిన సభేకారణమని నా దృఢవిశ్వాసం. అతని చావుకేకాదు. ఇక్కడ చెప్పబోయే విషాదగాథ కంతకూకూడా ఆనాటి సభేకారణ మంటాను. దానికి కారణం జన్మాంతరం కావచ్చు. అది వేరే సంగతి. ప్రస్తుతకారణం (Immediate Cause) సంగతి నేను చెప్పేది.

పడుపువృత్తి నిర్మూలనచట్టము కొత్తగా తీర్మానమైన రోజులవి. దాన్నిగురించి దేశంలో కొంత గగ్గోలు బయలుదేరింది. ఈ చట్టాన్ని ప్రజలకు బాగా విశదపరచి అమలులో పెట్టడానికి మద్రాసు పురప్రముఖులు కొందరు పూనుకున్నారు. ఒక సభ ఏర్పాటుచేశారు. చిత్రంగా ఉంటుంది, మనుష్యుల ఆలోచనలూ, చర్యలూ చూస్తుంటేను. ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క పద్ధతి. పూర్వకాలంలో అయితే ఎవడిపని వాడు చూచుకుంటూ, జపమో తపమో, యజ్ఞమో యాగమో చేసు

ఉంటూ ఎవరి తరుణోపాయం వాళ్లు చూచుకోడమే కాని, ఇంకొకణ్ణి తరింప చెయ్యాలనుకునే రోజులు కావవి. "స్వయం తీర్ణః పరాన్ తారయతి" రోజులవి. ఇప్పు డలా కాదే. మనసంగ తెప్పుడేనా చూచుకోవచ్చును. ముందు పక్క ఇంటివాళ్ల సంగతి, గ్రామం సంగతి, దేశంసంగతి చూచి, వాళ్లనుద్ధరించే ప్రయత్నం చెయ్యాలనే రోజులివి. మనం పాశ్చాత్య ప్రభువులవల్ల నేర్చుకున్న ధర్మసూక్ష్మాల్లో ఇదొకటి. అందుచేత ప్రతిదానికీ ఒకసభా, ఒక కమిటీ, చందాలు వగైరా తప్పవు.

నాకు ఏ సభన్నా, ఏ ఉపన్యాసమన్నా, తలనొప్పి. వెళ్లడం ఇష్టముండదు. తత్రాపి, సంఘోద్ధరణ సభలంటే మరీని. కాని మా సాంబశివుడి బలవంతాన్ని నేనూ తయారై సభకు బయలుదేరాను. ఒక్క అరగంట ఇంచుమించులో సభకు అంతా హాజరయ్యారు. పురప్రముఖుల్లో హేమాహేమీలు కూడా చాలామంది వచ్చారు. అందులో ముఖ్యులు - శ్రీపురంరాజావారు, స్వామినాథ అయ్యరుగారు, తిరువెంకటా చారిగారు, జయరాం నాయుడుగారు, దామోదరం మొదలి యారుగారు, సుబ్రహ్మణ్యం చెట్టిగారు, లక్ష్మీదేవిగారు, అండా ళ్లమ్మగారు, రమాబాయిగారు - ఒకరేమిటి, అన్నిజాతుల వారూ, స్త్రీ పురుషాదులు తయారయ్యారు. మావాడు వాళ్లం దర్నీ చూచి కొంచెం నిర్ఘాంతపోయి, "ఇదేమిటి, వీళ్లందరూ వచ్చారెందుకు" అన్నాడు, రహస్యంగా. "ఏమి ఎందుకు రాకూడదు" అన్నాను.

"ఎందుకు రాకూడదేమిటి? నీకేం మతిలేదా ఏమిటి? వీళ్లని ఎరగవు నువ్వు. వీళ్లలో ఈ చట్టం కావాలన్నవాడు ఒక్కడేనా వున్నాడూ? వేశ్యల నెరగనివాడూ, వాళ్లకోసం

డబ్బు తగలెయ్యనివాడూ ఎవడు ఇందులో? ఇటువంటి దానికేనా కాస్త శీలం, నీతీ, నియమం ఉండేవాళ్లు కావాలి కానీ వీళ్లెందుకూ" అన్నాడు కొంచెం తీవ్రంగా. మా పక్క నున్నవాళ్లకు వినపడుతుందేమోనని నా భయం. పైన చెప్పిన పెద్దమనుష్యులంతా పెద్ద పెద్ద వకీళ్లు, వర్తకులు, ధనికులు, అసెంబ్లీ మెంబర్లూను. ఊళ్లో ఏ సభా, ఏ కార్యం వాళ్లు లేందే జరగదు. అలాటివాళ్లని పట్టుకుని వీళ్లెందుకంటే! "కాలాన్నీ, దేశాన్నీ అనాలి కానీ వీళ్లనని ఏమిలాభం" అని ఏదో చెప్ప బోతుంటే, సూటూ కళ్ల జోడూతోటి దర్జాగా ఒకతను చక్కా వచ్చాడు. ఆయన్ను అంతా చాలా గౌరవంగా పలకరించి ముందు కూర్చోపెట్టారు. "అరే! వీడూనా! ఛీ! అసహ్యం! మంట, దరిద్రం! నేవుండనిక్కడ! లే పోదాం" అన్నాడు మా సాంబశివుడు.

నేను పట్నంలో పెద్దల్ని చాలామందిని ఎరిగి ఉన్నాను కాని ఇతన్నెప్పుడూ చూడలేదు.

"కూచోవోయి నాయనా! చంపక! ఇక్కడికి వచ్చేదాకా నిలవనిచ్చావుకావు. వచ్చిన తరువాత సభ ప్రారంభమైనా కాకుండా లేలెమ్మంటావేం? ఈ వచ్చిన పెద్దమనిషి ఎవరు! సంగతేమిటి? నీకెందుకింత ఖంగారు?" అన్నాను.

మావాడుకూడా పెద్ద ధనికుడూ, ఉద్యోగీ కాకపోయినా, ఛోటానాయకుల్లో ఒకడు. మంచి నిజాయితీ అయినవాడు. కష్టపడి పట్టుదలగా పనిచేసేవాడు. అందుచేత ఏసభ వచ్చినా, ఏ కమిటీ వచ్చినా, నిజమైన కష్టమైన పనికావాలి అంటే మావాడిని ముఖ్యంగా ఒక సభ్యుడుగా తీసుకుంటారు. అందు చేత సాంబశివుడు వూళ్లో అన్ని రకాల మనుష్యులనూ ఎరుగును.

"వాడా? బద్మాష్! వాడిని ఎరగవూ? పరాంకుశంపిళ్లె. వాడు పట్నంలో అందరికన్నా పెద్దముండల ముఠాదారు (Brothel keeper). వాడు మనకోపెద్దా! ఎంత దుర న్యాయం!"

నాకు నమ్మ బుద్ధిపుట్టలేదు. "పోవోయి, నీ కబుర్లూ నువ్వూనూ! మరీవింతగా చెపుతావు నువ్వు. నువ్వు చెప్పినట్టే అయితే వాడికింత గౌరవం, సభాపూజ్యతా ఎలా వచ్చాయి" అన్నాను.

"సభా పూజ్యతాలేదు, వాడి పిండాకుడూలేదు! వాడిని ఈ వూళ్లో ఎరుగనివాళ్లులేరు. జనాభా లెక్కలలో వాడివృత్తి 'వ్యాపారం' అని వుంటుంది. ఆ వ్యాపారమేమిటయ్యా అంటే, ఈ వూళ్లోవుండే పెద్దపెద్దలందరకూ, అనగా స్త్రవ్యసన మున్న వాళ్లందరకూ ముండలను తార్చడం. ఏ జాతిలో, ఏవయసులో, ఏరకం మనిషి కావాలంటే, దాన్ని క్షణంలో తీసుకువచ్చి వప్పచెపుతాడు. ఇక్కడికి వచ్చిన పెద్దలలో ముప్పాతికమందికిపైగా వాడితో అవసరం వుంటుంది. అందు కని వాణ్ణి గౌరవించకేంచేస్తారు? లేకపోతే వాడు అల్లరి చేస్తాడేమో! వాడు పెద్దమనిషీ, సభాపూజ్యుడూను! చూడు. పాపం! ఆ రాజాగారూ, ఆ అయ్యరుగారూ ఎంత ఆప్యా యంగా మాట్లాడుతున్నారో! ఇంకోక్షణం ఉంటేవాణ్ణి ఏ కమిటీ లోనో వేస్తారుకూడాను." అన్నాడు నిప్పులు కక్కుతూ.

ఇంతలోనే దొర ఒకాయన వచ్చాడు. ఒక పెద్ద మనిషి తొందరగా వెళ్లి అయన్ను ముందుకు తీసుకువచ్చి కూర్చో పెట్టాడు. ఎక్కడనుంచో పూలహారం ఒకటి తెచ్చివేశారు. అయన ఎవరో, ఎందుకింత మర్యాద చేస్తున్నారో తెలియదు. "ఏంలేదు. కేవలం దొరగనక. దొరైతే మంచివాడు అయి

తీరాలిగా.!''

ఇంతలో పరాంకుశంపిళ్లై-ఆదొరతో ఇదివరకే పరిచయ ముందికాబోలు-ఆయనతో మాట్లాడి, అక్కడున్న పెద్దలంద రకూ పరిచయం చేశాడు.

"ఇదేమిటీ! వీడూ పిల్ల చేతులో పడ్డాడూ''అన్నాడు సాంబ శివుడు. "ఇంకనేనా లేస్తావా, పోదాం'' అన్నాడు. "కూర్చో! ఈవేడుకేదో చూచేపోదాం.''అన్నాను. బలవంతాన కూర్చు న్నాడు.

పూర్వ కళావతిని ఒకావిడను అగ్రాసనాధిపతిగా ఎన్ను కున్నారు. ఆవిడ గంభీరోపన్యాసం అయింది. దొరగారు హైందవ దురాచారాలనుగురించీ, సంఘంలో ఉండే అవి నీతినిగురించీ, వేశ్యావృత్తిని గురించీ చాలా దీర్ఘోపన్యాసం చేశారు. మా వాడిని పట్టుకోడం కష్టమయింది. విడిచిపెడితే దొరను రెండు వాయించి చక్కావస్తాడని భయపడ్డాను. తరు వాత రాజాగారూ, అయ్యరుగారూ, ఇంకా మరికొందరూ ఉప న్యాసా లిచ్చారు.

"ఆ పరాంకుశంగాడు మాట్లాడితే వాడిగొంతుక పిసికి నేనాత్మహత్య చేసుకుంటా''నన్నాడు సాంబశివుడు. "నీతీర్మా నంలో ప్రథమ భాగం అంగీకరించడమైనది.''అన్నాను నేను.

వాడి ధర్మమాఅని పరాంకుశం ఉపన్యాసం ఇవ్వలేదు. చట్టాన్ని అమలులో పెట్టడానికి విజిలెన్సు కమిటీ ఒకటి ఏర్పాటుచేశారు. అందులో పైనచెప్పిన ప్రముఖులు, దొర గారు, పరాంకుశం అందరూ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. మావాడినికూడా ఉండమన్నారుకానీ మావాడు చాలాసిగ్గు పడుతూ అంతభారం వహించలేనని పటపట పళ్లుకొరుకుతూ బయటకు వచ్చాడు.

౨

ఆ శుభసమయంలో ప్రారంభించిన విజిలెన్సు కమిటీ పని ప్రారంభించిది. పేటపేటకూ ఒకసబ్‌కమిటీ ఏర్పాటు చేశారు. ఊరంతా వలవేసి గాలించడం మొదలుపెట్టారు. చాలామంది భయపడి పట్నంనుంచి మకాం ఎత్తేసి, సైదాపేట, పరంగిమల, పల్లావరం మొదలైన సమీపగ్రామాలు చేరుకున్నారు. ఇంతలో ఎవరో బుద్ధిమంతుడు బయలుదేరి వాళ్ళకు సలహాచెప్పాడు. "ఎందుకిలా ఖంగారుపడి పారిపోతారు? వేశ్యావృత్తి మాన్పడానికి కాదిది. నలుగురైదుగురు వేశ్యలుకలిసి, ఒకరియాజమాన్యంకింద వ్యాపారం సాగించకూడదని యీబిల్లు ఉద్దేశం. కాబట్టి మీరు విడిపోయి ఎవరిమట్టుకువారు హాయిగా ఉండండి'' అన్నాడు ఆ పెద్దమనిషి. ''బాగుంది యీసలహా'' అనుకున్నారు. వాళ్ళువిడిపోయి, ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క సంసారికొంపలో చేరారు. ఇప్పుడు మింటుస్ట్రీటు అనీ, చంగాయంగడి అనీ అక్కర్లేకుండా పట్నమంతా పాకిపోయారు. దానితో వాళ్ళను పట్టుకోవడం కష్టమయింది. కాని లంచగొండి ఉద్యోగులకు మట్టుకు చాలా అనుకూలంగావుంది. సంసారులయిళ్ళకు– లోకువవాళ్ళను చూచి–వెళ్ళడం, వాళ్ళనుబెదిరించడం, నాలుగురాళ్లుగుంజుకోవడం, ఇదీపద్ధతి. పరాంకుశం లాటివాళ్ళకు మరోలాభం. కమిటీపనిమీద తిరుగుతుండడంలో కొత్తకొత్త పక్షులను పట్టడానికి వీలుచిక్కింది.

అలాదొరికిందే సౌభాగ్యం. పద్దెనిమిదేళ్లుకూడా పూర్తిగా నిండని పడుచుదనం. తెల్లజామపండుకంటె అందమైన శరీరచ్ఛాయ. చెంపకు చారెడు కళ్లు. అబ్బే! లాభంలేదు.

ఆపిల్లను వర్ణించకూడదు. చెప్పబోతే యీమాటలు ఎంత సామాన్యంగా, చప్పుగా ఉన్నాయో తెలుస్తుంది. ప్రపంచం లోకల్లా సౌందర్యవంతమనుకొన్న శిల్పవిగ్రహాలకేనా వంక ఉండవచ్చుకాని యీ అమ్మాయికి వంక యెంచడానికి వీలు లేదు. అటువంటి సౌందర్యం కొన్నిజన్మలెత్తి ఎంతోసుకృతం చేసుకుంటేనేకాని కంట పడడం కూడా కష్టమే. కాని ఇటు వంటి అమూల్య వజ్రంవెళ్ళి గులకరాళ్ళలో పడ్డది. ఆపిల్ల దారిద్ర్యం ముగ్గురి మరణానికి కారణమయింది.

ఇంత అన్యాయం ఎందుకు జరగాలో తెలియదు. పూర్వ కాలంలో అయితే, డబ్బుతో నిమిత్తంలేని రోజులలో అయితే, కేవలం వంశ మర్యాద, మనిషి సుగుణసంపత్తి మాత్రమే లెక్కకొచ్చే రోజులైతే, ఏయింట పుట్టినా యిబ్బందిలేదు. కాని ఈరోజుల్లో డబ్బుతోనే మర్యాదా, సుగుణసంపత్తీ, తెలివితేటలూ వచ్చే యీ రోజుల్లో, సర్వసౌఖ్యములూ, సంతో షములూ, జీవితం అంతా డబ్బుతోనే ఉన్న ఈరోజుల్లో దరి ద్రులకు పుట్టడంకంటె దౌర్భాగ్యమేముంటుంది? ఉంటుంది. లేకనేం? ఇంతకంటే దౌర్భాగ్యం ఏమిటంటే ఆడపిల్లకు, ఇంకో దరిద్రుడికి భార్యకావడం.

సౌభాగ్యం భర్త పోస్టాఫీసులో గుమాస్తా. పల్లెటూళ్లో పుట్టింటే దుర్భరమనిపించిన దారిద్ర్యం పట్నవాసంలో మరింత దుస్సహమని వేరే చెప్పడమెందుకు? ఒక ఇరుకు సందులో, ఎనిమిది కాపురాలున్న ఇంట్లో కాపురం రెండు పూటలూ, కడుపునిండా నాలుగు వస్తువులూ వేసుకు తిన డానికీ చాలని జీతం భర్తకి. ఆఫీసులోవాళ్లు కనిగి యిచ్చిన జీతపురాళ్లేకాని, పైనకానీకూడా సంపాదించడానికి వీలుకాని, వ్యవధికాని లేని ఉద్యోగం. అందులోనే ఎలాగో రూపాయో

అర్ధో మిగులుతే, భర్త కాఫీఖర్చుకో, తలగుడ్డకో, జోడుకో సరి పోయేది. ఇంట్లోకూచోడానికిచాపా, పడుకోడానికి పాతబట్టాతప్ప ఓపరుపూ, మంచం, కుర్చీ ఏవల్లకాడూలేదు. ఉన్నా పెట్టు కోడానికి చోటేదీ? ఊళ్లో ఎక్కడ చూచినా, ఎవళ్లని చూచినా, ముద్దినుసుముక్కారు చీరలూ, జాకెట్లూ, తలలో పువ్వులూ, ఒంటినిండా వస్తువులూ పెట్టుకొని, భర్తచేతులో చేయికలిపి, కార్లలో షికారు తిరుగుతూ ఉంటారు. నా ఖర్మమేనా ఇలా కాలింది అనుకునేది సౌభాగ్యం. డబ్బులేకపోతేమట్టుకు అందరికి మల్లేనే సరదాగా సంతోషంగా ఉండడానికేమి? కొత్తగా కాపురానికి వచ్చిన రోజుల్లోనేనా, ఆమొగుడేమి మొద్దో కాని, తనభార్య అనమాన సౌందర్యవతిఅని గ్రహించినట్టు తోచదు. అతిమెత్తనై, మెరిసిపోయే శరీరాన్ని కప్పడానికి ఈ ముతకనూలుగుడ్డలు పనికిరావన్నమాట తోచలేదనుకుంటాను. యమునాతరంగాల్లా, నల్లగా నొక్కులు నొక్కులుగా మోకాటి పల్లంవరకూ వేలాడే జుట్టుకు చక్కని సుగంధతైలం, అఖ రుకు మంచిదువ్వైనేనా కొన్నపాపాన్ని పోలేదు. రోజూ అఖ రుకు తల్లోపువ్వులకు ఒక్కకానీకికూడా కరువైపోయె. పోనీ, అనుకూలుడైన భర్త అయితే ఇవేవీ కనపడవు. రాత్రి తొమ్మి దింటికి వచ్చి రెండు మెతుకులు నోట్లోవేసుకుని భార్యఇల్లు సవరించుకుని వచ్చేసరికి గొడ్డులా నిద్రపోవడమే కాని, ఆ చక్కని, ఎర్రని, నిండైన పెదవులెపుడూ ముద్దుపెట్టుకున్న జాడకనపడదు. అగాధములూ, నిర్మలములూ, నిశ్చలములూ నైన ఆమెకళ్లలో తన ప్రతిబింబం ఎప్పుడూ చూడలేదను కుంటాను. శ్రీకారములలాంటి చెవులలో తన హృదయవేదన ఎపుడూ చెప్పివుండడు. అజంతా చిత్రకారులనూ, అమరావతీ శిల్పులనూకూడా సిగ్గుపరచే ఆ స్తనద్వయాన్నేనా, ఎన్న

డేనా పరామర్శించాడా అని అనుమానం. ఇంక ఏ అర్ధరాత్రో ఏ వి్రదకళ్లనో ఏంచేస్తేనేం, ఏంచెయ్యకపోతేం?

సౌభాగ్యానికి చిన్నతనంలోనే జీవితమంతా శూన్యంగా కనుపించింది. అందరికిమల్లేనే ఆ అమ్మాయీ ఏవో అమా యికపు సుఖ స్వప్నాలు కొన్నికన్నది. ఏదో ఆనందం అనుభ విద్దామనుకుంది. కాపురానికొచ్చిన కొద్దిరోజులకే స్వప్నానికీ, వాస్తవానికీ వుండే తారతమ్యం తెలుసుకుంది. ఈ సౌందర్యం అంతా ఈ అంధకారంలో మాటుమణిగిపోవలసినదేనా! ఈ యవ్వనమంతా అడవిలో పూసినపూవులాగా వ్యర్థం కావల సిందేనా అని నిస్పృహ బయలుదేరింది!

కాని తనతోటి వాళ్లంతా అంత సుఖంగా ఎలా ఉండ గలుగుతున్నారు? వాళ్లకాపట్టుచీరలూ, జాకెట్లూ ఎక్కడి నుంచి వస్తున్నాయి? వాళ్లభర్తలూ తక్కువ జీతగాళ్లేనే? ఎక్కడికో వెడుతుంటాను, వస్తుంటారు. సినిమాలు, నాట కాలు, షికార్లు ఎంతో హాయిగా వుంటారు. ఎలాగా అను కునేది. ఆ సందేహాలన్నిటికీ సమాధానం సరోజిని చెప్పింది.

సరోజిని ఈ ఇంట్లోకి కొత్తగా కాపురానికి వచ్చింది. ఒక్కతే వచ్చింది. భర్త ఎక్కడో వున్నాడంది. ఉన్నాడో లేదో ఎవ ళ్లకూ తెలియదు. తరువాత తెలిసింది ఒక సానికొంపలో నుంచి వచ్చిందని. వచ్చినప్పటినుంచీ, సౌభాగ్యంతో, ఎంతో చనువుగానూ, ఆదరంగానూ మాట్లాడేది. త్వరలోనే సౌభాగ్యం పరిస్థితులూ, మనస్తత్వమూ తెలుసుకుంది. ఒక రోజున నిల వేసి అడిగింది.

''ఎందుకు నువ్విలాబాధ పడతావు? అందరికి మల్లేనే నువ్వూ హాయిగా ఉండరాదూ? ఎవరొద్దన్నారు నిన్ను?''

''ఎలాగమ్మా! నీకేం, కబుర్లు చెపుతావు! నువ్వు ఏంచేసినా,

ఎక్కడికి వెళ్లినా అడిగేవాడులేడు."

"నిన్నుమట్టుకు ఎవరడుగుతారు? నీమొగుడింట్లో లేనంత సేపూ నువ్వేంచేస్తే ఎవరు చూడొచ్చారు? ఈ ఇంట్లో వాళ్లెవ్వరూ మాట్లాడరు. నాదిపూచీ. వీధిల్లోవాళ్లకు నీగొడవ పట్టదు కదా! నాలుగు డబ్బులు సంపాదించుకుంటూ సరదాగా వుంటే మీ అయనమట్టుకు వద్దంటాడా ఏమిటమ్మా! ఆయన్ను అడగకుండా, బాధించకుండానువ్వు సంపాదించుకుని షోగ్గావుంటే అయనమరీ సంతోషిస్తాడు. ఇవన్నీ ఎక్కడివని మామూలు మనిషి ఎవ్వడూ అడగడు. ఈ పట్నంలో పద్ధతే అంత. నీకు తెలియక ఏమో అనుకుంటున్నావు."

మరి రెండు రోజులకు ఒక సినీమాలో అవకాశం వచ్చింది. సరోజిని వచ్చిచెప్పింది. ఒకచోట ఎక్స్ట్రా కావాలట. అయిదు రూపాయలిస్తారు. కష్టమేమీలేదు. వస్తావా, అంది. ఏమీ లేకుండా అయిదురూపాయలొస్తాయంటే సౌభాగ్యానికి ఆశ పుట్టింది. ఎలాగైతేనేమి, హడలిపోతూ బయలుదేరింది, భర్తతో చెప్పకుండా.

అక్కడ కొత్తగానూ, తమాషాగానూ, సంతోషంగానూ వుంది. ముఖానికి రంగుపూశారు. చక్కని బట్టలుకట్టి, వస్తువులుపెట్టి అలంకరించారు. భర్తకు తన సౌందర్యం కనపడలేదు. కాని అక్కడున్న ప్రతివాడూ, డ్రైవరు దగ్గఅనుంచి డైరెక్టరువరకూ అందరూ వొళ్లంతా కళ్లుచేసుకుని ఈ పిల్లను చూడడం మొదలుపెట్టారు. పదిపదిహేనుగురు ఈ అమ్మాయి అడ్రసు అడిగి తీసుకున్నారు. ఆ రోజున సుఖంగా భోజనం పెట్టారు. మధ్యమధ్య కావలసినంత కాఫీ ఇచ్చారు. సాయంకాలం అయిదురూపాయలు చేతులోపెట్టి, మళ్లీ కబురుచేసినపుడు తప్పకుండా రమ్మని చెప్పిపంపించారు.

తన పదిహేడు సంవత్సరముల జీవితంలోనూ ఏదోవిధ మైన ఆనందం అనుభవించినది ఈ రోజుననే.

ఇలా ఆనెలలో నాలుగైదుసార్లు ఎక్స్ట్రాగావెళ్లి ఒక పాతిక రూపాయలు సంపాదించింది. అంతేకాకుండా అందులో ఒకతనితో కొంచెము పరిచయంకూడా కలిగింది. చాలా మంచివాడు, పాపం! రెండుమూడుసార్లు కాఫీహోటలుకూ, సినీమాకూకూడా తీసుకువెళ్లాడు. సినీమాలోనూ, రిక్షాలోనూ రెండుమూడుసార్లు కౌగిలించుకుని ముద్దుపెట్టుకున్నాడు కూడాను. కాని ఇంతమంచిగా ఉన్నపుడు ఈ మాత్రానికేమి టని ఊరుకుంది సౌభాగ్యం.

## 3

ఆ నెల సంపాదనతో సౌభాగ్యం శుభ్రమైన బట్టలు కొను క్కుంది. మనిషిలో నిరుత్సాహం పోయి జీవితంలో ఒకవిధ మైన ఆనందం బయలుదేరింది. దానితో ముఖానికి కొత్త వికాసం, తేజస్సూ వచ్చాయి. వూళ్ళో వాళ్లమాట అటుంచి, సినీమా వాళ్లందరికళ్లూ ఈ అమ్మాయిమీదనే పడ్డాయి.

మనిషిలో మార్పూ, దుస్తులలో మార్పు భర్త చూచాడో లేదో చెప్పలేం. చూచినా చూడనట్టుగానే ఊరుకున్నాడు. సినీమాల్లో పని ఎక్కువగా రావడం మొదలుపెట్టింది. తరుచు రాత్రులుకూడా వెళ్లవలసి వచ్చేది. అందుచేత భర్తకు చెప్పకతప్పిందికాదు. ఒకరోజున చెప్పింది. విన్నాడు. కాస్సేపు ఊరుకున్నాడు. ఆఖరుకు "సరే, నీ ఇష్టం" అన్నాడు. ఆరోజునుంచి ఎక్కువ బాహటంగా తన ఇష్టం వచ్చినప్పుడు తన ఇష్టంవచ్చిన చోటికి వెళ్లడం మొదలు

పెట్టింది. మెరకమీదనుంచి కిందికి జారడమే ప్రారంభించాలి కాని, బయలుదేరిన తరువాత వేగము ఎక్కువ కావడమేకానీ ఆగడమంటూ ఉండదు కదా!

ఒక సినిమాలో అసిస్టెంటు డైరెక్టరుతో పరిచయం, చనువూ ఎక్కువయింది. రోజూ అతను తీసుకువెళ్ళి తీసుకు వస్తూ ఉండేవాడు. మామూలుగా ఒకనాడు సాయంకాలం వచ్చి, షూటింగుకని తీసుకెళ్లాడు. కాని ఇల్లు బయలుదేరిన తరువాత షూటింగు లేదనిచెప్పి సినిమాకు తీసుకెళ్ళి, హోటల్లో ఇద్దరూ భోజనంచేసి, ఎగ్మోరులో ఒక హోటల్లో రాత్రి నిద్రచేశారు. తెల్లవారుఝామున లేచివస్తూంటే పరాంకుశం కళ్లపడ్డారు. పాపం! అతనూ ఒకావిడను తీసుకువచ్చి ఒక ఉద్యోగికి వప్పచెప్పాడు. ఆవిడ ఇవతలికివస్తే ఇంటి దగ్గర దిగపెడదామని కనిపెట్టుకున్నాడు. సౌభాగ్యాన్ని చూడ్డంతోనే రాత్రంతా నిద్రమానుకుని కాపలాఉన్న కష్టం మరిచిపోయాడు. ఈ సౌందర్యరాశి మద్రానులో ఇంతకాలం తన కంటపడకుండా ఎలా ఉందనుకున్నాడు. ఇటువంటి రంభను కనిపెట్టలేకపోవడం తన ప్రజ్ఞకు లోటని సిగ్గుపడ్డాడు. తిన్నగా తలవంచుకుని వెడుతున్న సౌభాగ్యం దగ్గరకు వెళ్లాడు.

"ఎవరు నువ్వు" అని దబాయించాడు. ఆ అమ్మాయి హడలిపోయి మాట్లాడలేకపోయింది. పక్కనున్న పెద్దమనిషి ఏదో చెప్పబోయాడు.

"నువ్వెవరయ్యా? ఈ మనిషి నెక్కడనుంచి తీసుకొచ్చావు?"

"ఈవిడ నా భార్యండీ"

"నోరుముయ్యి. నీ భార్యా! ఇల్లూ వాకిలీ విడిచిపెట్టి ఈ హోటలు కెందుకొచ్చారు? ఇంత తెల్లవారకట్లే ఎక్కడి

కెడుతున్నాయి ?''

ఇంకనేముంది ? కుర్రాడు చిత్తయిపోయాడు. ఏ సమా ధానమూ చెప్పలేకపోయాడు. కళ్లనీళ్లు గిర్రున తిరిగాయి. ఎవరో పోలీసు ఉద్యోగనుకుని ఆయన్ను బ్రతిమాలడం మొదలుపెట్టాడు. పరాంకుశం గంభీరంగా వాడిని చీవాట్లు వేసి, వాళ్ల ఎడ్రసులు వ్రాసుకున్నాడు. వాళ్లు హడలిపోతూ సిగ్గుపడి వెళ్లిపోయారు.

వీళ్లు సరియైన చిరునామాలు ఇవ్వలేదేమోనని అనుమానం కలిగింది పిళ్లకు. ఇంతకాలం ఈ అమ్మాయిని తెలుసుకోలేక పోవడమే తప్పు. ఇప్పుడు చేతచిక్కిన దాన్నివిడిచి పెట్టు కుంటాడా ? తాను మళ్లీ వస్తానని అక్కడ బంట్రోతుతోచెప్పి నిమ్మళంగా వాళ్లను వెంబడించి, ఆ అమ్మాయి చిరునామా సరిఅయినదేనని తేల్చుకుని వచ్చాడు.

అక్కడినుంచి సౌభాగ్యాన్ని వెంటాడడం మొదలుపెట్టాడు పరాంకుశంపిళ్ల. కాని సినీమాపని ఎక్కువగా ఉండడంవల్ల ఆవిడ దర్శనం కావడమే కష్టంగాఉండేది. కాని పరాంకుశం పట్టుదలగలవాడు. ఒక మాత్రానికి అధైర్యపడే మనిషికాడు. అందులో ఇటువంటి పిల్లకోసం ఆ జన్మాంతంకూడా కనిపెట్టు కుని ఉండవచ్చు.

సౌభాగ్యానికి ఎలాగైనా సినీమాలో పెద్దపేరు సంపాదించు కుందామని సరదా బయలుదేరింది. ఈవిడను ఎలాగైనా స్టారును చేద్దామని అక్కడ అసిస్టెంటు డైరెక్టరుకు సరదాగా ఉంది.

పరాంకుశం నెమ్మదిగా ఎలాగైతేనేమి సౌభాగ్యాన్ని పట్టు కున్నాడు. కాని ఆ అమ్మాయి ఒకపట్టాన్ని లొంగలేదు. తన ఆశయం ఆయనతోచెప్పి తన్నివిడిచి పెట్టమంది. పరాంకుశం

తన తెలివితేటలూ, లౌక్యం అంతా ఉపయోగించి సినిమా లాభంలేదని ఆ అమ్మాయికి నచ్చచెప్పి వప్పించేటప్పటికి తలప్రాణం తోకకువచ్చింది. సినిమాలో ఈ అమ్మాయికి తప్ప కుండా పేరువస్తుంది. వస్తే, ఇంక తనకేసి కన్నెత్తి చూడ నేనా చూడదని బాగా తెలుసు. అందుకని అంతతంటాలు పడ్డాడు.

## ౪

ఎంత ఓరిమి ఉన్నవాడైనా, వారానికోపూటైనా చేసుకున్న పెళ్లాంకంటపడకపోతే, ఎప్పుడో ఒకప్పుడు వొళ్లుమండదూ! మొదటిరోజుల్లో కొంచెము విసుక్కునేవాడు. తరువాత భార్య మంచి మంచి చీరలూ, ఇంట్లోకి సామాన్లూ తనకు కానీ ఖర్చులేకుండా తీసుకురావడంచూచి సంతోషించాడు. ఇంకా ఎప్పుడేనా చీకాకుపడితే, తనకు ఎప్పుడు కావలిస్తే అప్పుడు రెండో, మూడో, అయిదో, పదో, అవసరాన్నిపట్టి చేతులో పెడుతూ వుండేది. ఇంకనేం కావాలి? ఏమని కోప్పడగలడు? ఈ డబ్బు ఎలావస్తోంది, ఎక్కడినుంచివస్తోంది అని ఒక్క మాటన్నా నోరుతెరిచి అడగలేదు. తెలియకనా? తెలిసా? అడిగి బంగారుగుడ్లుపెట్టే బాతును చంపుకోడమెందుకను కున్నాడేమో! అక్కడికీ అప్పుడప్పుడు ఏవో పిల్లసమేరీలు తెస్తూనే ఉండేవాడు. చడామడా నాలుగుకేకలేసుకునేవాళ్లు, ఊరుకునేవాళ్లు. కాని ఈసారిమట్టుకు అలాకాలేదు. పాకం ముదిరింది. ఈ అనుకూల దాంపత్యం విడిపోయే రోజులొచ్చాయి.

నేవిన్న రోజుల్లో నేనూనమ్మలేదు. ఇప్పుడు మీరూనమ్మ

రనుకుంటాను. ఒకటిరెండుసార్లు తనస్నేహితుడనీ, తనపై అధికారనీ, ఎవరో ఉద్యోగస్థుడనీ ఎవరెవరినో తీసుకువచ్చి, భార్యకు పరిచయంచేసి కాఫీ కాచిమ్మనీ, తనకేదో తొందరప నుందనీ, త్వరగావస్తాననీచెప్పి బయటికిపోయి గంటో రెండు గంటలో ఉండి, వస్తుండేవాడు. దానిభావం సౌభాగ్యం మొదట గ్రహించలేకపోయింది. కాని రెండోసారి తెలుసు కుంది. తెలుసుకొని తనవీలునుపట్టి వాళ్లతో వ్యవహరించేది.

ఈసారి పేచీకి ఇదేకారణం, ఎవరినో నలభై ఏళ్ల కరి మొద్దుని ఒకణ్ణి తీసుకువచ్చాడు. ఎక్కడో ఇంజనీరు; తన స్నేహితుడన్నాడు. ఫలహారం, కాఫీ తయారుచెయ్యమన్నాడు. సౌభాగ్యం ఒక్కసారి ఆమొద్దునూ, తీసుకువచ్చిన మొగుణ్ణీ ఎగాదిగాచూచి, తనకు తీరికలేదంది.

"తీరికలేక పోవడమేమిటి."

"అనగా, నాకు వేరే పనుందన్నమాట."

"పనుంటే మట్టుకు, వాకట్లోకి పెద్దమనిషివస్తే కాస్త కాఫీ ఐనా కాచనంటావేం?"

"ఎవరు?"

"ఎవరేమిటి?"

"పెద్దమనిషి ఎవరని?"

"ఏమిటీ! ధోరణి ఎక్కువగా ఉంది! పొగరు బోత్తనం బలిసింది?"

"మీరుపెట్టి పోషించేదానితో అలా బలుస్తోంది."

బయలుదేరినవేళ మంచిది కాదనుకుని, వచ్చిన పెద్ద మనిషి నెమ్మదిగా, సగౌరవంగా వెనక్కు జారాడు. అక్క డితో భార్యభర్తలకు మాటామాటాపెరిగి చెయ్యీచెయ్యీ కలి సింది. జడపట్టుకుని బరబర వీధిలోకి లాక్కొచ్చి "ఫో,

నాయింట్లోంచి'' అని వీధిలోకి గెంటిపారేశాడు సౌభాగ్యాన్ని.

ఆ సమయాన్నే ఆదారిని పరధ్యానంగా వెడుతున్న సాంబ శివుడిమీద పడ్డది పాపం! సాంబశివుడు, పాపం, ఆవిడను లేవతీసి, వొళ్లుదులిపి, లోపలికి తీసుకువెళ్లి, భర్తను మంద లించాడు. ఆయన, పాపం, తప్పు అభిప్రాయపడ్డాడు. ఈయనే తన భార్య ముఖ్యస్నేహితు డనుకున్నాడు. అందుకని సాంబ శివుడితో కొంచెము పేచీపెంచడం మొదలుపెట్టాడు. మా వాడతని ధోరణి కనిపెట్టి నోరుమూయించి, వొళ్లుదగ్గర పెట్టుకు మసలమనిచెప్పి చక్కాపోయాడు. కాని భార్యాభర్తల మధ్యను బయలుదేరిన మంట మండుతూనేవుంది కాని, అంతటితో ఆరిపోలేదు.

సౌభాగ్యం మరునాడు భర్త ఆఫీసుకు వెళ్లగానే తను ఈ ఇల్లువిడిచిపెట్టి తనదారి తనుచూచుకోవాలని నిశ్చయం చేసు కుంది. మధ్యాహ్నం మూటాముల్లీ అన్నీ సర్దుకునేసరికి శని లాగ పరాంకుశం తయారయ్యాడు. ''ఎక్కడికన్నా ఊరికి వెడుతున్నారా ? నాతో చెప్పకుండా వెళ్లిపోవడం ధర్మమేనా ? కాస్త నా చెవినివేస్తే నేనూ వచ్చేవాడినికదూ. మిమ్మల్ని విడిచి పెట్టి నేను బ్రతుకగలనా'' అని నెమ్మదిగా లాలన ప్రారం భించాడు. తనమాటవిని జాలితలిచే మనిషి దొరికాడు కదా అని తన కథంతా చెప్పుకుంది.

పరాంకుశం, పాపం, కావలసినంత సానుభూతి చూపిం చాడు. ఆమె భర్తను నిర్మొహమాటంగా తిట్టాడు. అటువంటి కర్కోటకుడితో కాపురం చెయ్యడంకంటే మహాపాపం మరొ కటి లేదన్నాడు. ఎవరి స్వతంత్రం, ఎవరిసౌఖ్యం వారికి ఉండాలన్నాడు. తన చాతుర్యం యావత్తూ ఉపయోగించి, మళ్లీ ఈజన్మలో భర్తదగ్గరకు వెళ్లనని వాగ్దానం తీసుకున్నాడు

సౌభాగ్యందగ్గర. వెంటనే బండితీసుకొచ్చి, అవిడను ససా మానుగా ఎక్కించి రాయపేటలో ఒకఇంట్లో పెట్టాడు. అవిడకేంభయంలేదని అభయం ఇచ్చాడు.

ఆ సాయంకాలం ఇంటికి వచ్చినప్పటినుంచీ సాంబశివు డికి ఏమీ తోచలేదు, తిండిసయించలేదు, నిద్రపట్టలేదు. ఆ అమ్మాయినిచూస్తే, ఆ పిల్లఅవస్థ తలుచుకున్న కొద్దీ ఏదో విధమైన, ఎన్నడూ ఎరుగని జాలిబయలుదేరింది. మరునాడు ఒకసారివెళ్లి చూచివద్దామా అని అనుకున్నాడు కాని ఎందు కని మళ్లీ వూరుకున్నాడు. ఆ మరునాడు ఇంక పట్టలేకచూచి ఆవిడసంగతేదో పూర్తిగాతెలుసుకోవాలని బయలుదేరివచ్చాడు.

తీరా వచ్చేసరికి, భర్త బోనులో పులిలా తిరుగుతున్నా డింట్లో. ఇతన్నిచూడగానే మండిపడి అమాంతం మింగేసే టట్టు ఇతనిమీద పడ్డాడు. ఇతనే తీసుకుపోయాడని భ్రమ పడ్డాడు మొదట. కాని రెండు నిముషాలు సాంబశివుడితో మాట్లాడిన తరువాత తనది పొరపాటని తెలుసుకుని అతన్ని క్షమించమని ప్రాధేయపడ్డాడు. సాంబశివుడు, ఈ మనిషి ఏమయిపోయింది, ఈవిడను మళ్లీ చూడడమెలాగు, ఏ దుర్మా ర్గుడిచేతులో పడిందో, అక్కడనుంచి తప్పించడ మెలాగు అనే ఆలోచనతో, ఆందోళనతో ఇంటికివచ్చాడు. కొన్నాళ్ల వరకూ ఎంత ప్రయత్నంచేసినా ఆ పిల్లజాడ తెలియలేదు. సాంబశివుడు ఎప్పుడూ, ఏ విషయంలోనూ ఇంత ఆందోళన పడలేదు. ఎవ్వరికోసమూ ఇంత తాపత్రయపడనూలేదు, ఆ పిల్లమీదనేమైనా మనసుపోయిందేమో నంటారా! ఎవర్ని గురించి ఆమాట అనుకున్నాసరే కాని సాంబశివుడిని గురించి మట్టుకు అంటే నేను ప్రాణంపోయినా, అతను చెప్పినా అంగీకరించను.

## ౫

పరాంకుశం అలభ్యయోగ్యంగా దొరికిన యీపిల్లను తనివి తీరా తన ఇష్టంవచ్చినట్లు వాడాడు. ఆ అమ్మాయీ ఏమీ అనలేక అతనికి లొంగి ఊరుకుంది. పిళ్లె ఉదయాస్తమానాలూ యీపిల్లతోనే కాలక్షేపంచేస్తుండేవాడు. క్లబ్బుకు, మీటింగు లకూ దేనికి రావడం మానేశాడు. తన వ్యాపారంకూడా ఉపే క్షించడం మొదలుపెట్టాడు. ఖాతాదారులందరికీ ఆశ్చర్యం వేసింది. పరాంకుశం ఇలా నరమానవుడి కంటపడకుండా ఊళ్లో ఉండికూడా ఉండడం ఇదేమొదటిసారి. దీనిలో ఏదో రహస్యం ఉందని వాళ్ళంతా ఆచోకీ తియ్యగా, రాయపేటలో ఇతను ఉండడం, సౌభాగ్యంతో ఉండడం అందరికీ తెలిసి పోయింది. ఆపిల్లను చూపించమని కుక్కల్లా పీక్కుతిన్నారు. గత్యంతరంలేక ఒక్కొక్కరికే వప్పచెప్పడం మొదలు పెట్టాడు.

సౌభాగ్యం ఏడిచింది, మొత్తుకుంది, దెబ్బలాడింది. ఏమి చేసినా లాభంలేకపోయింది. వేశ్యావృత్తి తనముఖాన అక్ష రాలా వ్రాసి ఉందనుకొని, గత్యంతరంలేక, తన్ను చూచే వాళ్లులేక, తనమొర వినేవాళ్లులేక, తన్ను రక్షించేవాళ్లులేక, విధికి లొంగిపోయి, ధనికులైన పురుషశబ్ద వాచ్యులందరకూ ఆటవస్తువుగా తయారయింది.

రాయపేటనుంచి మకాం మాంబళానికి మార్చింది. ఒక చిన్నబంగళా, ఇద్దరు ముగ్గురు నౌకర్లూ, రెండుకుక్కలూ, ఇంటినిండా ఇంటిదుసామాను, ఒంటినిండా ఒంటిదువస్తు వులూ, పెట్టెనిండా పెట్టెదుబట్టలూ! ఇంక కావలసినదేముంది? చిన్ననాటి కలలు సత్యములయ్యాయా అనిపించింది. ఎప్పు

డేమేమికావలెననుకుందో అవన్నీ వచ్చి పడ్డాయి. కాని-కాని-సౌఖ్యమూ, సంతోషమూ మట్టుకు మృగ్యమయిపోయాయి. అంత చిన్నతనం, అంత అమాయకత్వం ఒకటి రెండు సంవత్సరములలో ఎగిరిపోయినాయి. ఈ రెండుసంవత్సరములలోనూ చాలామంది సంసారిణులకు తెలియనివెన్నో తెలుసుకుంది. పురుషులెంత పశువులో తెలుసుకుంది. కామం యొక్క లోతు తరిచి చూచింది. డబ్బు ఎంత పాపిష్టిదో తెలుసుకుంది. పాపం యొక్క పరిమితిచూచింది.

మాంబళంలో ఆనోటా ఆనోటాపాకి అందరికీ ఈవిడసంగతి తెలిసింది. అఖరుకు ప్రతిరిక్షావాడికీ, ప్రతికూలివాడికి కూడా తెలుసు. కావడం తనకేలోటూలేదు. అందరికిమల్లేనే తనూ స్వతంత్రంగా ఒకబంగాళాలో ఉన్నది. నౌకర్లున్నారు. డబ్బుంది. కాని పగలు ఈవిడతో మాట్లాడేవారు ఒక్కరూ లేరు. ఒక్కరూ ఈవిడను పేరంటానికికాని, ఒక్కపూట భోజనానికికాని, పిలిచినవారులేరు. ఇరుగుపొరుగు పిల్లలేనా తనింటికిరారు సరికదా, ఆ ఇళ్ళల్లో కాకులేనా తనింటిమీద వాలవు. ఆశ్చర్యంకాదూ! అఖరుకు ముష్టివాళ్లేనా ఎవ్వాళ్లూవచ్చిన జాడఉండేది కాదు. రాత్రులు తనింటికివచ్చేవాళ్లేనా పగలెప్పుడూ కనపడేవారుకారు. ఖర్మంచాలక ఏరోడ్డుమీదో, ఏ బజారులోనో కనపడ్డా మాట్లాడకుండా, తన్నుచూడనట్టు నటించి చక్కాపోయేవారు. ఒక్కళ్లూ తమరింటికెప్పుడూ తనను తీసుకువెళ్ళలేదు. వాళ్ళ వాళ్ళ నిక్కడకు తీసుకురాలేదు. పాపం, ఎలా తీసుకొస్తారు? వారంతా పెద్దలు, విద్యాధికులు, ఉద్యోగులు, సంఘానికి నాయకులూ, మార్గదర్శకులూను! పడుపువృత్తిపనికిరాదని ఉపన్యాసాలిచ్చేవారు, పుస్తకాలు వ్రాసేవారు, చట్టాలుచేసేవారు, దాన్ని అమలులో

పెట్టేవారూను! వాళ్ళకామం తీర్చుకోడానికి తనో తోలుబొమ్మ కాని వారితో సరిసమానంగా సంచరించతగ్గ వ్యక్తికాదు. అంత అమాయకత్వమూ క్షణంలో హరించిపోయిందంటే ఆశ్చర్యమేముంది? ఈ కొద్దికాలంలోనే అముఖంలోవుండే లావణ్యం, సౌందర్యం, నాజూకూ అన్నీతగ్గిపోయాయి. విషవాయువు తగిలి మాడిపోయే పువ్వులా అయిపోయింది. ఏమున్నా, ఆఖరుకు మనిషిముఖంకోసం, అనగా మామూలు మనుష్యులకోసం, వారిసహవాసంకోసం, వారిమాటకోసం బెంగటిల్లిపోయింది. గత్యంతరంలేక ఆత్మహత్యచేసుకోవచ్చు నని కాని, చేసుకుందామనికాని ధ్యాసలేక అలాగే కాలక్షేపం చేసుకొస్తోంది.

అటువంటి అవస్థలో ఒకరోజు సాయంకాలం తన కుక్కల్ని తీసుకుని విజయరాఘవాచారి రోడ్డులో షికారు వెడుతుండగా, తలవని తలంపుగా, హఠాత్తుగా, అక్కడ నేలలో పుట్టినట్టు సాంబశివుడు ప్రత్యక్షమయ్యాడు. ఇద్దరూ ఒకర్నొకరు పోల్చుకున్నారు. ఇద్దరూ చైతన్యంలేనట్టు, వేళ్ళు పారినట్టు అలాగే ఒకరినొకరు చూస్తూ నిలబడిపోయారు. ఇద్దరికళ్లూ ఒక్కసారే చెమ్మగిల్లాయి. ఒక్కక్షణం ఊరుకుని ఇద్దరూ ఒక్కసారే మాట్లాడారు.

"మీ రిక్కడుంటున్నారా ఇప్పుడు ?"

"మీ రిక్కడుంటున్నారా ఇప్పుడు ?"

ఇద్దరూ చిన్నపిల్లలులా ఒక్కసారి నవ్వారు.

"అయితే, మీరు ఇక్కడే ఉంటున్నారన్నమాట ?" అన్నాడు సాంబశివుడు.

"అవునండి. మీరు ?"

"మైలాపూరు."

ఒక్క మాటు బెదురుతూ ఇటూఅటూ చూసింది. చెప్పలేని ఆనందం, పట్టరాని దుఃఖం ఒక్కసారి సముద్రపు పొంగులా వచ్చాయి. బ్రహ్మాండంమీద అపుకుంది.

"నిలబడే వున్నారు" అంది తనెక్కడున్నదీ మరిచిపోయి.

"ఏంచెయ్యను? రోడ్డుమీద కూచోడానికి నాకు అభ్యం తరంలేదుకాని, దారేపోయేవాళ్లకుకష్టంగాఉంటుందేమోనని."

ఇద్దరూ పకాలున నవ్వారు.

"ఎక్కడికేనా పనిమీద వెడుతున్నారా?"

"పెద్దపనేం లేదు. వచ్చినపని అయిపోయింది."

"అయితే మా ఇంటికి రావడాని కేమైనా అభ్యంతర ముందా?"

"అభ్యంతర మెందుకు? సంతోషంతో వస్తాను నడవండి."

గుమ్మంలో అడుగుపెట్టేవరకూ మళ్లీ మాటలేదు. ఎన్నా ళ్లకు మళ్లీ నిష్కల్మషమైన హృదయం, విషరహితమైన వాక్కు, ప్రతిఫలాపేక్షలేని స్నేహం - ఎన్నాళ్ళకు కళ్ళపడ్డది!

నిండినగుండెలతో, స్తంభించిన వాక్కులతో, చెమ్మగిలిన నయనాలతో, లోపలికివచ్చి కూర్చున్నారు. ఎక్కడ ప్రారం భించాలో, ఏమి మాట్లాడాలో తోచక యిద్దరూ కొంచెముసేపు నిశ్శబ్దంగా ఊరుకున్నారు.

"చాలా మంచికుక్కల్ని సంపాదించారు. బాగున్నాయి" అన్నాడు ఒక కుక్కను దువ్వుతూ, సాంబశివుడు.

"అవునండీ చాలామంచివే, ఇవే నాకు పిల్లలూ, స్నేహి తులూ, చుట్టాలూను" అందికొంచెము గద్గదికతో.

"నిజమే! వాటికున్నప్రేమలోనూ, విశ్వాసంలోనూ శతాం శమేనా మనుష్యులకులేదు. మనిషి గొప్పవాడని ఎందుకను కుంటామో తెలియదు."

"అందుకనే, హీనజాతి లక్షణాలన్నివిడిచి, హృదయంలే కుండా కేవలం యంత్రంలా ఉండగలదుమనిషి. స్వపర భేదంకూడా పాటించనక్కరలేదు. తన అవసరం ఎంత వరకో అంతవరకూ ఉపయోగించుకుని, అవస్తువుకేసి మళ్లీ తిరిగైనా చూడడు." అంది ఉద్రేకంతో.

సాంబశివుడు జవాబులేకుండా నిదానంగా సౌభాగ్యకేసి చూశాడు.

"ఈకొలదికాలంలో జీవితానుభవం చాలా సంపాదించి నట్లున్నారు. విధికొట్టే దెబ్బలుకొంచెం గట్టిగానే ఉంటాయి. తట్టుకోడం కష్టమే. సంఘంకూడా చాలా క్రూరంగా ఉంటుంది. వ్యక్తులను లక్ష్యపెట్టదు. అకారణంచేత మన హృదయాన్ని చంపుకుని, మానవజాతినే అసహ్యించుకోడం మంచిదికాదు."

"నిజమే కావచ్చు. నాకేంతెలుసును? ముక్కుపచ్చలా రనిదాన్ని. ప్రపంచమంతా మంచిది, సృష్టంతా ఆనంద మయం, ఇదంతా నా ఆనందంకోసమే పుట్టింది అనుకున్నా ను. ఇదిమంచి, ఇదిచెడ్డ అనిచెప్పినవాళ్లు ఒకళ్లూ లేకపో యారు. నాకష్టసుఖాలు హృదయం విప్పిచెప్పకోడానికికూడా ఎవ్వళ్లూ లేకపోయారు. నాదగ్గరకు పచ్చినవాళ్ళు యము లాళ్లలా నాశరీరాన్నీ, ఆత్మనీ చంపడానికేవచ్చేవారు. ఏం చెయ్యను ?" అని వెక్కివెక్కి రాగాలెట్టింది. కట్టతెగిపుకుపడ్డ ప్రవాహంలా దుఃఖం ఆగకుండా వచ్చిపడ్డది.

సాంబశివుడు, తల్లిలా ఆ పిల్లదగ్గఱకు వెళ్లి గట్టిగా పట్టుకొని తలనిమురుతూ ఆ పొంగు ఆగేవరకూ అలాగే కూర్చున్నాడు.

"ఆనాడు మిమ్మల్నిచూస్తే ప్రాణం లేచొచ్చింది. ఎందుకో తెలియదు. ఎన్ని జన్మాలనుంచో మిమ్ములనెరి గున్నట్టని

పించింది. మీరు మళ్లీ వస్తారేమో అని ఎంతో ఆశపడ్డాను. మీ రెవరు, ఎక్కడుంటారు అని తెలుసుకోడానికేనా వ్యవధి లేకుండా మీరు వెళ్లిపోయారు. దారేపోయే ప్రతిమనిషిని మీరేమో ననే ఆశతో ఎన్నిసార్లుచూచానో లెక్కలేదు. నాబ్రతు కిలాఉంటే మీ రెందుకు కనపడతారు? మీ రెందుకు రావాలో, మీకోసం ఎందుకింత ఆశపడ్డానో నాకేతెలియదు"

"నిజమే! మిమ్మల్ని చూడగానే నాకూ అలాగే అనిపిం చింది, నా తోబుట్టువనుకున్నాను. ఇతరుల విషయాల్లో- ముఖ్యంగా సంసారవిషయాల్లో - కలుగచేసుకోనివాడిని ఆరోజున మీ విషయంలో ఎందుకు కలుగచేసుకున్నానో నా కిప్పటికీ ఆశ్చర్యమే! మీరన్నట్టు ఇదేదో జన్మాంతర సంబం ధమే! కాని ఏమిలాభం? నేను మీకు అక్కరకు రాక పోయాను. ఏమీ చెయ్యాలేకపోయాను. నా వెధవసందేహాలు నన్నిలాచేశాయి. తీరా తెగించి మీ యింటికి వచ్చేసరికి మీరు వెళ్లిపోయారని తెలిసింది. పైగా నేనే మిమ్మల్ని తీసుకువెళ్లా నని మీ భర్త నామీద ఎగిరాడు. అప్పటినుంచీ మీ జాడ తెలుసుకుందామనీ, మిమ్మల్ని చూదామనీ నేనూ ఎన్నో ప్రయత్నాలు చేశాను. కాని నాకేమీ దారీ తెన్నూకనపడ లేదు. ఏమీ చెయ్యాలేక నోరుమూసుకొని ఊరుకున్నాను. కాని ప్రాణంమట్టుకు మీమీదనే ఉందంటే నమ్మాలి మీరు."

"ఆఁ! మాయింటికి మళ్లీవచ్చారా! నాకోసం వెతికారా? ఎంత నిర్భాగ్యురాలిని! మీరు వస్తారని ఏదో అనిపించినా వినిపించుకోక, ఒక్కపూటేనా ఆగకుండా లేచివచ్చాను. నారాత ఇలావుంటే ఎవరేమిచేస్తారు?" అని విచారించింది.

ఎంతోకాలానికి కలుసుకున్న ఆప్తబంధువులులా చాలా సేపు మాట్లాడుకున్నారు సాంబశివుడూ, సౌభాగ్యమూను.

మళ్లీ వస్తానని సాంబశివుడు లేచివచ్చాడు వీధిలోకి. గేటు దగ్గఱ పరాంకుశం ప్రత్యక్షమయ్యాడు. తన ఖాతాదారు కాని వాడు కొత్తవాడెవడో వచ్చాడే అని తేరి పారచూశాడు పరాం కుశం. "ఓరీ నీమొహం తగలెయ్యా! నీ చేతులోపడ్డదా పాపం! సరే, అపిల్ల చెప్పినదానికి పూర్తిఅయిన వ్యాఖ్యానం దొరికింది" అనుకొని చక్కాపోయాడు సాంబశివుడు.

కాపురానికి వచ్చినతరువాత ఈ ఒక్కరోజునే, మనస్సు సంతోషంగా ఉంట సౌభాగ్యానికి. ఈ మనిషి ఎవరు? మన మీద యెందుకింతదయ? మళ్లీకూడా ఆయన సంగతేమీ కనుక్కోనేలేదే అని అనుకుంటుండగా పరాంకుశం సిడసిడ లాడుతూ లోపలికి చక్కావచ్చాడు.

సౌభాగ్యానికి అతన్ని చూసేసరికి వొళ్లుమండిపోయింది. మనస్సు కాస్త సంతోషంగా ఉందనుకుంటుంటే ఈ సమయం లోనే ఈ పీనుగిక్కడి కెందుకు తగులపడ్డాడనుకుంది. మాట్లాడకుండా కూర్చుంది.

"ఎవరాయన?" అన్నాడు.

"ఎవరైతే మీకెందుకు? తమతో మనవి చేసుకోవాలా?"

"అబ్బే! ఊరికే అడిగాను, ఎప్పుడూచూచిన జ్ఞాపకంలేక. ఆ సినీమా సోదరుడేమో ననుకున్నాను."

సౌభాగ్యం మాట్లాడలేదు.

"ఏం అలా వున్నావు?"

"ఏంలేదు, తలనొప్పిగా ఉంది. పడుకోబోతుంటే మీ రొచ్చారు. శెలవు" అని లోపలికి చక్కాపోయింది.

పరాంకుశం కాస్సేపు కూర్చుని, ఏమిచెయ్యడానికీ తోచక చక్కాపోయాడు.

## ౬

మర్నాడు అన్నప్రకారం సాంబశివుడు వచ్చాడు. సౌభాగ్యం ముఖం చాటంత చేసుకుని ఎదురుగా వచ్చింది.

"మీరు వస్తారా, రారా అని నిన్నటినుంచీ అలాగంటలూ, నిమిషాలూ లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాను. పడుకోలేదు, భోజనం చెయ్యలేదు. నా జన్మలో దేనికోసమూ ఇంత ఆదుర్దాగా ఎదురుచూడలేదు."

"ఎందుకమ్మా, అంత అదుర్దా! నేనేంచేశాను నీకోసం? ఒక్కమాట సహాయమేనా చెయ్యలేకపోయానే?"

"ఇంతకంటే నాకేమి చెయ్యాలండీ మీరు? మానవ జాతి మీద నశించిన విశ్వాసము మళ్లీ చిగురింపచేశారు. ఈజాతిలో మానవత్వమే లేదనుకున్న దానికి ఉన్నదని ఋజువుచేశారు. అదిచాలు. నా హృదయంలో ఏర్పడిన శూన్యం తొలగించారు. ప్రేమామృతంతో నింపారు."

"అమ్మా! ఒట్టివెర్రి. కాలాన్నిపట్టి నీ హృదయంలో కలిగిన మార్పేకాని, నా ప్రయోజకత్వం ఏమీలేదు. నువ్వేమీ అనుకోకుండా ఉంటే సాహసించి ఒక్కసంగతి చెపుతాను."

"అబ్బ! నన్నుచూస్తే అంతభయం వేస్తోందేం? అయినా, మీకు భయమిస్తాను, చెప్పండి ఆ భయంకరవార్త ఏమిటో."

"ఏంలేదు. మీరీ మకాం, జీవితం మార్చడానికి వీలవుతుందా? ప్రయత్నం చేస్తారా? విధివశంచేత వచ్చిన ఈ దుర్భరావస్థ మిమ్మల్ని ఎంత బాధిస్తోందో, మిమ్మల్ని ఎలా తినేస్తోందో నాకు తెలుసు. కొంత ప్రయత్నంచేసి ఈ దొంగ ఊబిలోనుంచి బయటపడమని నా కోరిక."

"పడి?"

''పడి, ఏమీలేదు. మామూలుమనిషి గమ్మని.''

''హహ్హహ్హ! నేను మళ్లీ మామూలుమనిషిని కావడమే? మీరెంత అమాయకులండీ! నేను మామూలు మనిషినయ్యే అదృష్టం ఈ జన్మకులేదు. తారులో ఉండేనలుపేనా పోగొట్ట వచ్చునుకాని, నాజీవితంలో కళంకం పోగొట్టడం అసాధ్యం. నాజీవితమిలాగే సాగనివ్వండి. ఎప్పుడో నాపాపంపండి, కర్మ పరిపక్వం అయినతరువాత వొస్తుంది ఏదో మార్పు. తొందరేం? మీబోటివారు నాదగ్గరగా రావడం, నాతోమాట్లాడడం, తక్కిన వాళ్ళకు మల్లే నన్నుకూడా సగౌరవంగాచూడడం - ఇదేచాలు నాకీజన్మకి. ఎప్పుడేనా మీరుకనపడుతూ ఒక్కమాటు నాయోగ క్షేమం కనుక్కుంటూ ఉండడం - అంతేనాకు కావలిసింది.''

''అంత అధైర్యపడవలసిన పనిలేదు. నీజీవితమంతా ముందు ఉంది, కాలం తారులో నలుపూతగ్గిస్తుంది, జీవితంలో కళంకమూ పోగొడుతుంది. మనం సంకల్పిస్తే, శ్రద్ధతో తగిన సాధనచేస్తే, ఈజన్మేకాదు:. జన్మాంతర కృత కర్మకళంకంకూడా పోగొట్టుకోవచ్చును. మనకున్నఆయుస్సు అందుకే.''

సౌభాగ్యానికి ఉన్న అధైర్యం, పిరికితనంపోయి, వింత ధైర్యం, ఉత్సాహంవచ్చాయి. జీవించవలెననే ఆశ, జీవితంలో ఆనందం ఉన్నదనే నమ్మకం, ఇంకా అనుభవించ వచ్చుననే నిశ్చయం కలిగాయి. ప్రపంచం, కాలం, కష్టం, సుఖం, ఆకలీ, దప్పికా అన్నీ మరచి గాలివానలో చెట్టు కొమ్మనంటిపెట్టుకుని కూర్చున్న పక్షులులాగ కూర్చుని సాయంకాలంవరకూ కబుర్లు చెప్పుకున్నారు. సాంబశివుడు మళ్లీవస్తాననీ, పనున్నదనీ వెళ్ళడానికి లేచాడు. సౌభాగ్యం కూడా లేచింది.

"మీరివేళ తుపానులో సముద్రంలో కొట్టుకుపోయే జీవాన్ని ఒడ్డుకి లాక్కొచ్చి ప్రాణదానంచేశారు. మీరుచేసిన ఉపకారం ఇంతా అంతాకాదు. నామీదనుంచి ఏదో బరువు పోయినట్టు, ఎంతోతేలికగాఉంది. రేపు ప్రాణంపోయినా నిశ్చింతగా పోవచ్చును. ఒక్కసారి మీపాదాలు ముట్టుకో నివ్వరూ?"

సాంబశివుడు పొంగివచ్చే దుఃఖాన్ని అపుకుని వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు. అతనువెళ్లినవేపేచూస్తూ ఎంతసేపో అలానిలబడిపోయింది సౌభాగ్యం. కొంతసేపటికి లోపలికివెళ్లి కాస్త కాఫీతాగింది. ఇంతలో పరాంకుశం చక్కా వచ్చాడు.

## 8

పరాంకుశం కాలయాపనేమీ చెయ్యకుండా వచ్చినపని వెంటనేచెప్పాడు. ఆవిడను త్వరగాడ్రస్సువేసుకుని సిద్ధముగా ఉండమన్నాడు, "కారుపంపిస్తాను. మామూలు హొటల్లో మామూలుగదిలో తొమ్మిదిగంటలకు ఉండు" అన్నాడు.

"ఏమిటీశని ఇలా వెంటాడిస్తోంది! నిన్ననూ అయన వెళ్ళగానే ఈయనొచ్చాడు; మళ్లీ ఇవాళా అలాగే తయారయ్యాడు! ఈపెడదారినుంచి మంచిదారికొద్దామంటే పడనివ్వడా ఏమిటీ ముండాకొడుకు" అనుకుంది.

తనీవేళ రాలేనన్నది. వంట్లో బాగాలేదన్నది. ఇంక ఈ వృత్తే అక్కరలేదన్నది.

"ఏమిటీ? ఈవృత్తే అక్కరలేదూ? ఏం, చేదుమేశావా? సుఖంగా, స్వతంత్రంగా ఉన్నావు. కావలసినంతడబ్బు,

ఇల్లు, వాకిలి, వస్తువులు, వాహనాలు ఏమిటి నీకొచ్చినలోటు! ఇంతకంటె ఇంకో చోటమట్టుకు నీకు ఎక్కువొచ్చేది ఏమిటి?"

"ఏమీలేదు నాకిదివరకు వచ్చినదిచాలు. ఇంక నాకేమీ అక్కరలేదు. నన్నింతటితో విడిచిపెడితే అంతేచాలు."

పరాంకుశం నవ్వాడు. వేళాకోళంచేశాడు. కోప్పడ్డాడు. బెదిరించాడు. బ్రతిమాలాడు. ఏమిచేసినాలాభంలేకపోయింది. పరాంకుశానికేమీ పాలుపోలేదు. అవతల పెద్దమనిషికి మాట ఇచ్చాడు. వ్యాపారంలో అన్నప్రకారం సరుకు వప్పచెప్పక పోతే పరపతి చచ్చి ఊరుకుంటుంది. అందుచేత ఎలాగైనా తీసుకువెళ్లితీరాలి. అందులోనూ ఈమనిషి ఎప్పుడోకాని తన దగ్గరకురాడు. అందుచేత అతనిబేరం పోగొట్టుకోడానికి వీలు లేదు. మళ్లీ అనేకరకాలుగా బ్రతిమాలాడు. అప్పుడూ విన లేదు. అఖరుకు ఒక ఎత్తువేశాడు. ముందు అరాత్రి పూచీ గడిచిపోతే తరువాత దానిరోగం కుదుర్చవచ్చుననుకున్నాడు.

"చూడు. మంచో చెడో ఏదో ఇన్నాళ్ళనుంచీ అయి పోయింది. నేను ఏదిచేసినా నీకు ఉపకారమనే ఉద్దేశంతోటే చేశాను కాని నా స్వలాభంకాదు. నామాటనమ్ము. నువ్వను కున్నట్టుగానే మానెయ్యి ఈ వృత్తి, మంచిదే. నా అభ్యంతర మేమీలేదు. ఈ ప్రశంస మళ్లీ ఎప్పుడేనా నీదగ్గరచేస్తే నన్ను చెప్పు తీసుకుకొట్టు. ఈవేళమట్టుకు నీవు అంగీకరించక తప్పదు, నా గౌరవం కాపాడాలి. తప్పదు, కావలిస్తే నీ కాళ్లు పట్టుకుంటాను." అని ఎన్నివిధాల ఎంత నీచంగా బ్రతిమా లాలో అన్నివిధాలా, అంత నీచంగానూ బ్రతిమాలాడు.

సౌభాగ్యం చాలాసేపు ఆలోచించింది. వీడి మాటనమ్మ వచ్చునా ? కూడదా ? పోనీ, నమ్మకపోతే మట్టుకు మునిగి పోయింది ఏముంది ? ఈ ఒక్కసారీ ఏదో ఏడ్చి చక్కావస్తే,

పీడివలలో నుంచి మర్యాదగా బయటపడొచ్చు నేమో! అన వసరంగా పాముతో వైరం పెట్టుకోడమెందుకు? ఆలోచించి ఆలోచించి ఆఖరుకు సరేనంది.

పరాంకుశం బ్రహ్మానందపడ్డాడు. ఆవిడ నొక్కసారి ముద్దు పెట్టుకోపోయాడు. కాని ఆవిడ వప్పుకోలేదు. కారు పంపుతా నని చెప్పి పరాంకుశం చక్కాపోయాడు.

తొమ్మిది గంటలకు కారువచ్చింది. సౌభాగ్యం బయలు దేరింది. కాని ఎందుచేతనో ఎప్పుడూలేని బెంగతోచింది. ఏదో ఘోరవిపత్తు సంభవిస్తుందేమో ననిపించింది. కాళ్లు బరువు లెక్క ముందుకి అడుగు సాగలేదు. అలాగే ఎలాగోవెళ్లి కారులో కూర్చుంది.

హోటలుకుచేరి గదిలోకూర్చున్న అరగంటకు బయట అడుగుల చప్పుడూ, మరుక్షణంలో తలుపు నెమ్మదిగా కొట్టిన చప్పుడూ వినపడ్డాయి. వెళ్లి తలుపుతీసింది. లోపలికి ఒక దొర చక్కావచ్చాడు. సౌభాగ్యం తెల్లపోయింది. పొరపాటున ఒక గదిలోకి వెళ్ళవలెననుకుని ఈ గదిలోకి వచ్చాడోమో ననుకుంది. కాని వాడు వెళ్లేప్రయత్నం లేకపోగా పైగా తలుపువేసి నవ్వుతూ లోపలికి వచ్చాడు. అప్పటికే తాగి ఉన్నాడు. జేబులో ఇంకోసీసా కనపడుతోంది.

తనపేరు జాన్సన్ అనీ, పరాంకుశం తీసుకొచ్చాడనీ చెప్పాడు. తనకు ఈదేశస్థులంటే చాలా యిష్టమన్నాడు. ఇక్కడ ఆడవాళ్లు చాలా బాగుంటారన్నాడు. ఇలా ఏదేదో వాగుతూ కూర్చున్నాడు. సౌభాగ్యం దూరంగా మౌనంగా నిలబడ్డది. "రా, దగ్గరకురా భయంలేదు. ఎంతచక్కగా ఉన్నావు?" అని లేచివచ్చి, కౌగలించుకుని తీసుకువెళ్లి వొళ్లో కూర్చోపెట్టుకున్నాడు.

ఆ దుర్మార్గుడు తాగిఉండి ఏమిఘోరంచేశాడో తెలియదు. ఎవ్వరూ తెలుసుకునే సావకాశంలేదు. సౌభాగ్యం చచ్చి పోయింది. గొంతుకపిసికి చంపేశాడు. ఆవిడప్రాణం పోవడం తోటే వాడిమైకం వదిలింది. హడలిపోయాడు. ఏమిచెయ్యా డానికి తోచలేదు. కొంతసేపు అలాగే కూర్చున్నాడు. ఎలాగో లేచి నిశ్శబ్దంగా, ఆ అర్ధరాత్రి ఆ శవాన్ని బుజాన్నేసుకొని తన కారులో ఎక్కించుకొని మాంబళం తీసుకువచ్చి, ఆపిల్ల పర్సులో తాళంతీసి, తలుపుతీసి, లోపల మంచంమీద ఆ అమ్మాయిని పడుకోపెట్టి, కారు తిన్నగా బెంగుళూరు పట్టించి, తెల్లవారకుండా బెంగుళూరు చేరాడు.

ఇక్కడ తెల్లవారేసరికి ఈభయంకరవార్త ఊరంతా పాకి పోయింది. పరాంకుశానికి తెలిసి పారిపోదామనుకుంటుండ గానే పోలీసులువచ్చి పట్టుకున్నారు. సాంబశివుడు ఈమాట విని, నిశ్చేష్టుడై, కొన్నాళ్ళవరకూ మతిపోయినట్టు ఏదో పిచ్చిగా ఉండేవాడు.

౮

కేసు సెషన్సుకు వచ్చింది. ఊరంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది. ఈ స్వామినాధ అయ్యర్లుకాని, అయ్యంగార్లు కాని, చెట్టియార్లుకాని, ఒకళ్ళకూ చీమకుట్టినట్టేనాలేదు. సౌభాగ్యాన్ని ఎరిగున్న ఇంతమందిలోనూ ఆవిడచావుకు నిజంగా కన్నీరు కార్చింది ఒక్క సాంబశివుడే.

పరాంకుశం కేసు విచారణ అయింది. అతనే హంతకుడని ఋజువుచేశారు. అతని ఖాతాదార్లలో ఒక్కడూ అతన్ని రక్షిద్దామన్నవాడు లేకపోయాడు. దొరసంగతి చెప్పబోయాడు

కానీ ఎవళ్లూ నమ్మలేదు. పరాంకుశానికి మరణదండన విధించారు. ఒకమనిషి చంపబడింది, అందుకని ఒకమనిషిని ఉరితీశారు. న్యాయం జరిగింది. ఇంకేం కావాలి ? వీళ్లు లేక పోవడంవల్ల ప్రపంచానికి వచ్చిన లోటేముంది ? ఒకడికి పది మంది పరాంకుశాలు బయలుదేరుతారు. ఒక సౌభాగ్యానికి వందమంది సౌభాగ్యాలు బయలుదేరుతారు. జగన్నాథరథం వెడుతూంటే చక్రాలక్రిందపడి ఎంతమంది చావడంలేదు ? అయినా రథం సాగుతూనే ఉంటుంది. అందులో దేవుడు నవ్వుతూ అలాగే కూర్చుంటాడు. అలాగే మానవకీటకాలు కొంతమంది వచ్చినా పోయినా సంఘం సాగుతూనే ఉంటుంది.

పరాంకుశం హంతకుడు కాడేమోనని మా సాంబశివుడికి అనుమానం కలిగింది. పరాంకుశం అంటే ఎంతకోపం, మంటా అయినా ఒకమనిషి ప్రాణం నిర్హేతుకంగా పోతోంది అంటే చూస్తూ ఊరుకోలేకపోయాడు సాంబశివుడు. తను ఒక రిద్దరు స్నేహితులతోచెప్పి వాకబుచేసి ఆచోకీతీసి, ఇతను నిర్దోషిఅని తేల్చాడు. కాని ఇది కోర్టులో ఋజువుకావడమెట్లా? ఇతనువెళ్లి పరాంకుశం స్నేహితులతో మాట్లాడితే, ఏమీలాభం లేదనీ, అనవసరంగా తమరు అల్లరిపడి ఇతరులను అల్లరిపెట్ట వద్దనీ సలహాఇచ్చారు. ఏంచెయ్యాలో తోచక పిచ్చెత్తినట్టు తిరిగాడు. ఇంతలో పరాంకుశాన్ని ఉరితీశారు. సాంబశివుడికి మతిస్తిమితం బొత్తుగాపోయింది. తను బ్రతికిఉండి ఎవళ్ళకూ ఏ సహాయమూ చెయ్యలేకపోయాను సరే - ఆఖరికి యథార్థం తెలిసిఉండికూడా, ఒకతోటి మానవుడు నిర్హేతుకంగా ఉరితీయబడుతూంటే చూస్తూ ఊరుకోవలసి వచ్చిందే అని మరింత బెంగపెట్టుకుని ఆఖరుకు ఆత్మహత్య చేసు

-ఉన్నాడు. దానివల్ల సాధించిందేమిటో నాకర్థం కాలేదు. జగన్నాధుని రథం యధాప్రకారంగా సాగుతూనూ ఉంది, సాగనూ కలదు.



నేను పొలంపనులన్నీ చక్కపెట్టుకొని ఇంటికివచ్చేసరికి సుమారు పదకొండు గంటలవుతుంది. వెంకట్రావుగారు వస్తారని తెలుసునుకాని ఏపూటవచ్చేదీ వారువ్రాయలేదు; పైగా పనులతొందరచేతను, పెందరాడేవెళ్ళక తప్పిందికాదు. అయినా వారువస్తే కనిపెట్టమని మావాళ్ళతోచెప్పి వెళ్ళాను. అనుకున్నట్లుగానే మా ఇంటికి వచ్చేసరికి ఆయనా, వచ్చి అవశిష్టాలు తీర్చుకుని కూర్చున్నారు, నన్ను చూడడంతోనే లేచి 'నమస్కారం దీక్షితులుగారూ! మీ అనుమతిలేకుండానే, స్వతంత్రంగా మీ ఇంటికివచ్చేశాను. మీవారు, మీరింట్లో లేరని లోటులేకుండ నన్నెప్పుడూ చూడకపోయినా చాలా గౌరవంచేసి సమస్త సదుపాయాలుచేశారు. మనపూర్వపు మర్యాదలింకా మీలాటివారిండ్లలో నిలిచిఉన్నాయి' అన్నారు.

'బాగుందండీ వెంకట్రావుగారూ మా ఇంటికి మీరురావడం మా అదృష్టం అనుకుంటున్నాం. దానికో పెద్దశలవుకూడానా ఎంతమాట. మీబోటివారు మాఇంటికి ఎందుకువస్తారుచెప్పండి. నేటికేదో పనుండి మావూరుతొక్కారు కాని లేకపోతే మీరు హాయిగా మీపట్నవాసంలో ఉండవలసినవారేకాదూ. ఏదో మా పెద్దలు, వాళ్ళతపస్సుచేతనూ, సాధుజీవనంచేతనూ, పాండిత్యముచేతనూ ఒక ఇంత సంపాదించి పడేసిపోయారు. మా ప్రయోజకత్వం గుణించడమేకాని గణించడంలేదుకదా. వారి విద్వత్తువగైరా మాకేమి అబ్బలేదు. ఎటొచ్చీ ఇంక వారిపేరు నిలపడానికి మాకు చేతనైనదీ మేముచేస్తున్నదీ ఏమిటంటే గుమ్మంలోకి ఏవేళప్పుడు ఎవరువచ్చినా లేదనకుండా అపూటకు మాతోపాటు కాస్త పప్పూ చారూ అన్నంపెట్టడం. ఇది కూడా మా పెద్దలనుంచి నేర్చుకొన్నదే.'

'సరి, అది చాలదు దీక్షితులుగారూ! 'నాన్నోదక సమం

దానం' అన్నారు. ఈ రోజులలో అంత ఆదరంగా అందరకూ సమానంగా అన్నదానం చేసేవా రెవరున్నారు. సరే దానికేమి కాని, లేవండి పాపం, ఇప్పటికే ఆలస్యమయింది, స్నానం చెయ్యండి' అన్నారు వెంకట్రావుగారు.

'ఆఁ. పరవాలేదులెండి, మాకు అలవాటే. మీకు భోజనం వేళ దాటిపోయింది. మావాళ్లు కాస్త కాఫీయేనా ఇచ్చారో లేదో. మీస్నానం అయిందికదా—నేను పదినిమిషాలలో వస్తాను. ఇంటిదగ్గర పిల్లా పాపా అంతా కుశలమేకదా' అంటూ ఆయన సమాధానం వినకుండానే నే స్నానానికి వెళ్లిపోయాను.

నా స్నానం, అయేసరికి మా ఆవిడ పడ్డించింది. సరిగా ఆ క్షణానికే ఇంకొక ఇద్దరు అభ్యాగతులు మార్గత్వేనా వచ్చారు. అంతా కలిసి భోజనంచేశాము. భోజనంచేస్తున్నంత సేపూ వెంకట్రావుగారు, నన్నూ, ఇంటినీ, మా ఇంటి ఏర్పాటులనూ, శాకపాకాదులనూ, నేతి మజ్జిగలనూ, మా ఇల్లాలి వంటనేర్పునూ స్తోత్రంచేస్తూనే ఉన్నారు. అప్పు డప్పు డిలాటివి వింటూఉండడం నాకు కొంత పరిపాటు అయినా, వెంకట్రావుగారు అదె ఇదిగా అంటూఉంటే కొంచెం సిగ్గు పడ్డాను కూడాను. అయినా ఆయన అన్న ప్రతి అక్షరంకూడా చాలా హృదయపూర్వకంగా అన్నవేననికూడా గ్రహించాను

వచ్చిన అభ్యాగతులు విశ్రమిస్తామనివెళ్లి సావిట్లో పడుకున్నారు. మే మిద్దరం తాంబూలం వేసుకుంటూ కూర్చున్నాం. 'ఇక్కడ పంటలూ పరిస్థితులూ ఎలా ఉన్నాయి, దీక్షితులుగారూ' అన్నారు వెంకట్రావుగారు. 'పంటకేమండీ, పంట కెప్పుడూ లోటులేదు మాకు. పరమేశ్వరానుగ్రహం చేత - దానికితోడు ప్రభుత్వసహాయంకూడా ఉంటే దాళవా

కూడా పండుతుంది. సారవాకు ఎప్పుడూ లోటులేదు. కాని ఇంక తక్కిన పరిస్థితులంటారా, అవేమీ బాగాలేవు' అన్నారు.

'ఇంక లోటేమిటండీ పొలంలో పంట - ఇంట్లో గాదెలు, గేదెలు, ఆవులు, దొడ్లోనుంచి నీళ్ళు, బారుడు దూరంలో చెరువు, కాలవ - ఇన్ని సౌఖ్యాలుంటే, ఇంకా ఏమిటో ఇబ్బందులంటారేమిటి' అన్నారు వెంకట్రావుగారు.

'పైనుంచి వచ్చిన పట్నవాసస్థుల కలాగే కనపడుతుంది లెండి. కాని మా కుండే ఇబ్బందులు మా కుంటాయి, మీరూహించలేనివి'

'ఏమో మరి! నిజంగా నేను ఊహించలేకుండానేఉన్నాను.'

'ఇప్పుడు మీరు భూమి కొనవలెనని వచ్చారే! ఆ భూమీ, ఆ భూమిగల ఆసామీ చరిత్ర కొంచెంచెపుతాను. దాన్నిబట్టి మిగతాదంతా, బుద్ధిమంతులు, మీరే ఊహించుకోగలరు' అని ప్రారంభించాను.

౨

మాగ్రామం మొదట బ్రాహ్మణ అగ్రహారం, కాలక్రమేణా, ఇతరచోట్లకుమల్లేనే ఇక్కడకూడా, బ్రాహ్మణకుటుంబాలు చాలావరకు, వంశక్షయంచేతనూ, ధనక్షయంచేతనూ, సన్నగిల్లి, గ్రామాంతరాలకూ, పట్టణములకూపోగా మిగిలినవి ఆయిదారుమాత్రమే. వాటిలో వైదిక విద్యాసంపత్తి చేతనైతేనేమి, ఆర్థిక సమృద్ధిచేతనైతేనేమి, కులశీలాదుల చేతనైతేనేమి, పేరెన్నికగన్నవి మాకుటుంబము, భమిడిపాటివారి కుటుంబమూను. కాని భమిడిపాటివారు కూడా

ఆర్థికంగా చాలావరకు చితికిపోయారు.

బ్రాహ్మణ కుటుంబాలు నన్నగిల్లి పోవడంతోటే ఇక్కడ భూములు చాలా సారవంతము కావడము చేతనూ, నీటి వసతులు బాగుండడంచేతనూ, అన్యథాకూడా గ్రామం వాసయోగ్యంగా ఉండడంచేతనూ దాపునా దూరానా ఉన్న కమ్మప్రభువులు కొంతమంది మొదట ఇక్కడభూములు సంపాదించుకుని వ్యవసాయంసాగిస్తూ గ్రామసౌభాగ్యానికి తోడ్పడుతూండేవారు. అక్కడనుంచి వారినిపట్టి మరొకరూ, మరొకరిని పట్టి ఇంకొకరూ క్రమేణా కమ్మవారు ఎక్కువై కమ్మవారి అగ్రహారంగా మారిపోయింది, దానివల్ల వచ్చిన ఇబ్బంది ఏమీలేదు. భూములు బాగుపడ్డాయి. పంటలు విశేషంగా పండడం మొదలుపెట్టినాయి. దానితోపాటు పశుసమృద్ధి. ఇంతసస్యసమృద్ధి, ఆర్థికసంపత్తి ఉన్నచోట ఇతరజాతుల వారుకూడా చాలామందిచేరి గ్రామాభివృద్ధికి తోడ్పడ్డారు. ఒక్కవస్తువుకూ పొరుగూరు వెళ్ళనవసరము లేకపోయేది. కాలం ఎప్పుడూ ఒక్కరీతిగా ఎలా ఉంటుంది. మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా మార్పులువచ్చితీరుతాయి.

మారుమూలనున్న మాగ్రామానికికూడా నాగరికతా ప్రభావంసోకింది. మాగ్రామంలో స్థితిపరుల పిల్లలు పొరుగూళ్ళు వెళ్ళి ఇంగ్లీషువిద్య నభ్యసించడం, ఉద్యోగాలు చెయ్యడం, ప్రారంభించారు. మాకు పడవలకాలువ పక్కనేఉన్నది కదా. దానికితోడు గ్రామంలోకి కంకరరోడ్డుపడింది. ఆపైన రెండుమైళ్ళ దూరంలో రైలుస్టేషను ఒకటి వెలిసింది. దానితో వర్తకవ్యాపారములు, పైపట్నములకు రాకపోకలూ, రాజకీయాలూ ఎక్కువైనయి. ఒక తలమాసిన దాక్షిణాత్యుడు ఈ విశాలప్రపంచంలో ఎక్కడా చోటుదొరక్క మా

గ్రామంచేరి చిన్న కాఫీహొటలు ఒకటి పెట్టాడు. నాగరికత ఈరూపంతో మావూళ్లో అడుగు పెట్టింది. అతరువాత ప్లీడరు గుమస్తాగా ఒకపట్నంలో పనిచేసి బాగానంపాదించి ఈ వూళ్ళో ప్రైవేటుప్లీడరుగా స్థిరనివాసం ఏర్పాటుచేసుకుని ఇక్కడ లిటిగేషను బాగా అలవాటుచేసి అభివృద్ధిలోకి తీసుకువచ్చాడు. ఆ తరువాత క్రమంగా వార్తాపత్రికలు ఒకటిరెండు మా వూరుకూడా చేరినాయి.

రాజకీయంగా దేశంలో గాంధిమహాత్ముని ధర్మమా అని బ్రహ్మాండమైన నంచలనం బయలుదేరింది. దేశానికి దాస్య విముక్తిచేయవలెనని విదేశీయులను తొలిగించాలని స్వరాజ్య స్థాపనచేయాలని, మొదలైన మహదాశయాలు ప్రతివారి హృదయాలలోనూ మొలకలెత్తినాయి. మా అజ్ఞానాంధకారం తొలగించడానికి రాజకీయవేత్తలు మావూరుకూడావచ్చి తరుచు ఉపన్యాసాలుయిస్తూ వుండేవారు. అకారణంచేతను మా వూరులోకూడా కాంగ్రెసువాదులు కొందరు బయలు దేరేరు. వీరిని ప్రతిఘటించడానికి జస్టిసుపార్టీకూడా బయలు దేరిందని వేరేచెప్పడం యెందుకు. ఆ పార్టీనాయకులుకూడా తరుచు యిక్కడికివస్తూవుండడం కాంగ్రెసువారు దేశద్రోహులనీ యిన్నిశతాబ్దాలనుంచీ చేసిన అన్యాయం చాలక మళ్ళీ అతిదారుణం విద్రోహకరం ప్రజాస్వామ్యనాశనకరం అయిన బ్రాహ్మణ ప్రభుత్వం పునరుద్ధరించడానికి సంకల్పించారనీ దీనినేలాగైనా ప్రతిఘటిస్తేనేకాని దేశానికి చాలా అరిష్టమనీ రహస్యంగాను బహిరంగంగాను ఉపన్యాసాలిస్తూండేవారు.

ఇలావుంటూండగా మావూరు కాంగ్రెసు నాయకులలో మా పొరుగుననున్న వెంకటశాస్త్రి, కమ్మవారిలో నారాయణరావు చౌదరి మరికొందరు యువకులూ కలిసి నిర్మాణకార్యక్రమం

అమలులో పెట్టడానికి సంకల్పించి ముందు ఒకగ్రంథాలయం, ఒకసహకారసంఘం యేర్పాటుచేసి పనిచేస్తూండగా వారు జైలుకు వెళ్ళవలసివచ్చింది. తిరిగివచ్చేలోపున మావూరులో పంచాయితీబోర్డుకూడా యేర్పాటుఅయింది. ఇప్పటికిదేశంలో బ్రాహ్మణా బ్రాహ్మణద్వేషం యెంతవరకు వెళ్ళవలెనో అంత వరకూ వెళ్ళింది. గ్రామంలో బ్రాహ్మణుల నెలాగైనా వంచిం చవలెననీ వారినెలాగైనా నిర్మూలనంచేయాలనీ లేదా అధమం గ్రామంలోవించైనా వెళ్ళగొట్టవలెననీ చాలామందికి కాంగ్రెసు వారికీ, జస్టిసువారికీ-లోలోపల ఉద్దేశ్యాలు బయలుదేరేయి. ఈ అభిప్రాయాలు మొదట యువహృదయాల్లో బయలుదేరినా క్రమేణా పెద్దలకుకూడా వ్యాపించినాయి. దీనిఫలితంగా, ముందు కాఫీహొటల్లో పేచీలుబయలుదేరినాయి. అకారణం చేత కాఫీహొటలుపెట్టిన అయ్యరు పరారీ అయిపోయేడు. అందులోనే బ్రాహ్మణేతరుడొకడు వ్యాపారం సాగించడం మొదలెట్టేడు. బ్రాహ్మణ భూములుకౌలుకు తీసుకుని వ్యవ సాయంచేసే రైతులు ముక్తా సరిగాయివ్వకా, కదపా వ్రాసి యివ్వకా, భూములు స్వాధీనంచేయకా పేచీలుపెంచడం మొదలుపెట్టేరు. ఈ భూములకు సరిహద్దులోవున్న బ్రాహ్మణే తర భూస్వాములు అంగుళం అంగుళం చొప్పున గట్లు తెగ గొట్టి తమ వాటాలో కలుపుకోడం మొదలెట్టేరు. చేలకు నీరు సరిగారాకుండా చేస్తూండేవారు. ఈ బాధలుపడలేక కొందరు భూములమ్ముకొని గ్రామాంతరం పోవలసివచ్చింది, ఇవన్నీ బహిరంగంగా జరిగేవి.

ఇవికాక కనపడని బాధలు కొన్నివుండేవి. మా వూరిలో కమ్మవారు చాలామంది వుండడంచేతనూ వారి స్త్రీలకు ఘోషా యెక్కువగా వుండడంచేతనూ వారు తరుచు బయటకువచ్చే

అలవాటు వుండేదికాదు. బ్రాహ్మణస్త్రీలకు ఘోషా లేకపోవడం చేతనూ, ఆచారంయెక్కువగా వుండడంచేతనూ, దాసదాసీ జనం లేకపోవడంచేతనూ వారు తరుచు వీధిలోకిరాకతప్పేది కాదు. పూర్వం బ్రాహ్మణస్త్రీలు యేచెరువుకో వెడుతోంటే పెద్ద వాళ్ళంతా-అన్నిజాతులవారూ-తప్పుకోడం, వారిని మర్యాదగా చూడ్డం, వుండేది. ఇప్పుడాపద్ధతి మానేసి వారువెడుతోంటే యువకులంతా వీధి అరుగులమీది బార్లు తీర్చికూర్చోడం, వారు నడిచేవారిలోకి ఉమ్ములువేయడం చుట్టపీకలు పారవేయడం, వారినిగురించి వారికి వినపడేటట్లు అశ్లీలమైన సంభాషణలు చేయడం, ప్రారంభం అయింది. మాకందరకూ చాలా కష్టంగానేవుండేది. కాని చేసేదిలేక తలవంచుకొని సహించి వూరుకునేవాళ్ళం.

మావెంకటశాస్త్రిమాత్రం అలావూరుకునేవాడుకాడు. అనేకవిధాల వారించేము అతన్ని. ఎన్నివిధాల చెప్పినా ఎదురుతిరిగి మేము భీరువులమనీ మా అశక్తతవల్ల మా వంశాలు నాశనం అయిపోతవనీ కోప్పడుతూ వుండేవాడు. ఒకరోజున సాయంకాలం నాలుగుగంటలకు వెంకటశాస్త్రి మరదలు చెరువునుంచి నీళ్లబిందె యెత్తుకుని వచ్చింది. వెంకటశాస్త్రి యింటియెదురుగా వున్న వైశ్యుల అరుగుమీద కొందరు యువకులు కూర్చుని ఆమె వయ్యారాన్నీ లావణ్యాన్నీ వర్ణించుకుంటున్నారు. ఆమె కొంచెం యెత్తుగావున్న గుమ్మం యెక్కడానికి ప్రయత్నిస్తోంటే అందులో ఒక యువకుడు, తన అరుగుమీదనున్న వెంకటశాస్త్రినిచూచి, 'యేమయ్యా బేమ్మడా! పడుచుపిల్ల యెక్కలేక బాధపడుతోంటే సూస్తూ వూరుకుంటావేం ఆ - ళ్లు రెండూ పట్టుకుని పైకి లాక్క్' అన్నాడు. తక్కిన యువకులంతా పక పక నవ్వేరు.

వెంకటశాస్త్రి ఈ పరాభవం సహించలేక ఉగ్రుడై ఒక్క అంగలో క్రిందికిదుమికి, ఆ కుఱ్ఱవాని రెక్కపట్టుకుని క్రిందికి లాగి, యీదవడా అదవడా వాయించేడు. తక్కిన కుఱ్ఱాళ్లల్లో కొందరు వెంకటశాస్త్రి మీద కలపడ్డారు. మిగతావాళ్లు వూరంతా యీ వార్త అందించేరు. వెంకటశాస్త్రి బలాఢ్యుడు గనక ఆ కుర్రాళ్లని వదిలించుకొని తన అరుగుమీదకి వచ్చేడు. ఇంతలో గ్రామంలో వున్న పిన్నపెద్దలందరూ, యిక్కడేదో ఖూనీ జరుగుతున్నట్లు, ఒక్క పరుగునవచ్చి వెంకటశాస్త్రిని తిట్టడం ఆరంభించేరు. వెంకటశాస్త్రిని చిత్రవధ చేస్తామన్నారు, పాతేస్తామన్నారు. రూపులేకుండా మాపేస్తామన్నారు. అప్పుడు మేమందరంకూడా కలుగజేసుకుని జరిగిన యధార్థంచెప్పి, ఆ కుర్రవాడివే తప్పని నిరూపించి, తొందరపడకూడదని వాళ్లని సముదాయించి, ఆ పూటకి దొమ్మీ జరగకుండా ఆపుచేసేసరికి మా తాతలు దిగివచ్చేరు.

ఇంత కాలంనుంచీ లోలోపల అణిగి రగుల్కొంటున్న ద్వేషం బయలు పడ్డానికి యిదే మొదలు. తప్పు తమదైనా, ఒక బ్రాహ్మడు చేయిచేసుకోవడమేమనీ వానిమీద యేలాగైనా పగ సాధించి వానిని హతమార్చాలనీ ప్రతివాళ్లు లోపల శపథం పట్టేరు. నాటినుంచి బ్రాహ్మలను అనేక సూక్ష్మోపాయాలచేత బాధలు పెట్టడం యెక్కువైంది. వర్ణనాతీతములైన యీ అవమానములను సహించలేక మరి కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు గ్రామాంతరాలకు వలస పోవలసివచ్చింది. మిగతా వాళ్లం యెలాగైనా దీని అంతు చూడాలని పట్టుదలగా వుండిపోయేం. మా కుటుంబానికీ, వెంకటశాస్త్రి కుటుంబానికీ అనాదినుంచీ వస్తూన్న పేరు ప్రతిష్ఠలచేతనూ, వెంకటశాస్త్రికి రాజకీయంలో వుండే పలుకుబడిచేతనూ,

మమ్ములను సాధించడం సులభసాధ్యం కాదని, ఉపాయాంత రాలు ఆలోచిస్తూండేవారు.

ఇలా వుండగా శాసనసభకు యెన్నికలు వచ్చేయి. ఆ లోపుననే మాపంచాయితీబోర్డు, సహకార సంఘములకుకూడా యెన్నికలు జరపవలసివచ్చింది. దానిలో కాంగ్రెసు వాదులు కూడా వెంకటశాస్త్రికి వ్యతిరేకంగా పనిచేసేరు. అయినా వెంకటశాస్త్రి పార్టీకి విశ్వప్రయత్నం మీద విజయం చేకూర్చ గలిగేము.

దానితో గ్రామస్తులకు మామీద మరింత క్రోదం కలిగింది. పూళ్లోవారు, కాపులు మా యిళ్లలో పనిచేయకుండా వుంచపెతె నని ప్రయత్నంచేసేరు. చాకళ్లు, మంగళ్లు, మా యిళ్లకు రాకుండా చేయాలని ప్రయత్నం చేసేరు. ఏరీతిగా మమ్మ లిని బహిష్కరించాలని ప్రయత్నంచేసినా వారి ప్రయత్న ములు సఫలములు కాలేదు. మేము చెరువులలో స్నాన ములు చేసేవేళ, యువకులు చాలామందివచ్చి అక్కడనే స్నానంచేస్తూ, యీతాలాడుతూ, మామీవ నీళ్లు చెంద గొడుతూ గొడవచేస్తూండేవారు. పూడ్పుల సమయాల్లో మాకు కూలీలు తరుణంలో దొరక్కుండా చేసేవారు.

మా యిళ్లలో శుభకార్యములు జరిగినప్పుడు గ్రామస్తు లందరినీ తాంబూలములకిపిలవడం, ఒక్కొక్కపూట,ఒక్కొక జాతివారికి భోజనములు పెట్టడం, ఆచారంగా వుంటూ వుండేది. ఒకసారి అలా పిలిచినప్పుడు, తాంబూలమునకు వచ్చినవారు ఆశీర్వచనమునకు అక్షతలు తమకుకూడా యిమ్మనమని పేచీపెట్టేరు. పోనీ మునిగిపోయింది యేమని అక్షతులు యిచ్చేరు. తరువాత తాంబూలములు యివ్వ బోతేంటే ప్రథమ తాంబూలం అక్కడ వున్నవారిలో వయో

వృద్ధుడు, స్థితిపరుడు అయిన ఒక కాపుకు, యిమ్మని నిర్బంధంచేసేరు. అందులకు మే మంగీకరించలేదు. అందు కని అందులో నాయకుడైన ఒక యువకుడులేచి, తమల పాకులు చెక్కలువున్న పళ్లెం తీసుకొని, యింకొకని చేతికి అరటిపళ్లబుట్టయిచ్చి, అందరకూ తాంబూలములు తమ యిష్టం వచ్చినట్లు పంచిపెట్టేరు. బ్రాహ్మణ్యం అంతా తాంబూలములు పుచ్చుకోకుండా వెళ్లిపోతూంటే బలవంతాన వారి నాపి, తలొక తాంబూలంయిచ్చి పంపేరు. వేంకట శాస్త్రికి తాబూలం యివ్వపోతే అతను పుచ్చుకోకుండా విద లించుకొని చక్కాపోయేడు. తమరు చేసినది తప్పుగా వారికి తోచలేదు గాని, వెంకటశాస్త్రి తాంబూలం పుచ్చుకోకపోవడం మట్టుకు చాలా తప్పుగా తోచింది.

ఇది జరిగిన మర్నాడు గ్రామంలో ఒకకమ్మవారింట వివాహం జరిగింది. మమ్ములనందరనూ మామూలుగా ఆశీర్వచనానికి పిలిచేరు. మేమంతా వెళ్ళేముకాని వెంకట శాస్త్రి మట్టుకు రానన్నాడు. అనవసరంగా పేచీపెంచడం యెందుకని, మేము రమ్మని చాలా బలవంతంచేసేము. ఎన్నడూ నామాటకు యెదురాడని వెంకటశాస్త్రి, యీమాటు రాను గాక రాను అన్నాడు. మమ్మల్నికూడా వెళ్లొద్దని చాలా దూరం చెప్పేడు. అరాత్రి పెళ్లివారు వూరేగింపుకు బయలు దేరేరు. ఊరేగింపు జరిగేటప్పుడు యిండ్లలోనివారు వెలుప లకు రావడం, వధూవరులను చూడ్డం, పెళ్లివారిచ్చే తాంబూ లం పుచ్చుకోడం, అచారంకదా. ఆరాత్రి వెంకటశాస్త్రి యివ తలకి రాలేదు. పెండ్లివారికికోపంవచ్చింది. వారిలో కొందరు వెంకటశాస్త్ర గుమ్మందగ్గరికి వెళ్లి తలుపులుకొట్టేరు. అతనేవచ్చి తలుపులుతీసేడు. తలుపు తీయగానే వీరిలో ఒకడు 'యేరా

లంజకొడుకా! శుభమాని పెళ్లిచేసుకుంటోంటే చూడలేక కండ్లలో నిప్పులుపోసుకుంటావేం! యింతపొగరా!' అని చాచి లెంపకాయకొట్టేడు. వెంకటశాస్త్రి 'ఆ' అని చెయ్యెత్తే లోపున యింకొక నలుగురు అతనిమీదపడి చావకొట్టేరు. యింట్లోవాళ్లు గొల్లుమన్నారు. మేమంతా పరుగెత్తుకొచ్చేసరికి పెండ్లివారు వడివడిగా వూరేగింపు చాలించి యింటికి చేరేరు.

మర్నాడు వెంకటశాస్త్రి క్రిమినల్ ఛార్జీపెట్టేడు. మేజస్ట్రీటు కోర్టులో వారికి ఒక్కొక్కరికి రెండుమాసములు శిక్ష, రెండు వందల జరిమానా పడినాయి. దానిపైనవారు అప్పీలుచేశారు. కేసు అప్పీలులోవుండగానే శాసనసభకు యెన్నికలు సమీపించినాయి. వెంకటశాస్త్రి యీ జిల్లాలో, ఒకస్థానానికి కాంగ్రెసు అధికార్లచేత నియమితుడయ్యేడు. ఎన్నికల సమయం సమీపించినకొద్దీ వ్యతిరేకపక్షంవారు విశ్వప్రయత్నంచేసినా వెంకటశాస్త్రి విధిగాగెలిచి తీరుతాడనే విశ్వాసంమాకూ భయం వారికీ కలిగింది. వెంకటశాస్త్రిని గెలవనివ్వడం గ్రామంలో ప్రతి ఒక్కరికీ శిరచ్ఛేదమైనట్లుగా భావించుకొన్నారు. ఇకను యెల్లుండి ఎలెక్షన్ జరగవలసినరోజు. వెంకటశాస్త్రికి విజయం తప్పదనే కోలాహలం బయలుదేరింది, వెంకటశాస్త్రి నిద్రాహారాలుమానుకొని ప్రతిగ్రామంతిరిగి కష్టపడుతున్నాడు. ఆరాత్రి యింటికివచ్చి యెలక్షన్ రోజున వెళ్లవచ్చుననే ఉద్దేశంతో సాయంకాలమునకు ఇల్లుజేరుకున్నాడు, అతనికొడుకులిద్దరూ, పెద్దకూతురూ, పెద్దకోడలూ ఇక్కడేవున్నారు. రెండవకూతురు అత్తవారింటవున్నది. మూడవకొడుకు మేనమామగారింటికి వెళ్లేడు. ఆరాత్రి ప్రొద్దుపోయేవరకూ నేనూ మరికొందరు గ్రామస్థులూకలసి వెంకటశాస్త్రి అరుగుమీదనే రాజకీయాలను గురించి మాట్లాడుకున్నాము.

ఆరాత్రి యేమిజరిగిందో యెలాజరిగిందో యెవరికీ తెలియదు. మరునాడుదయం పాలేరూ, పనిమనిషివచ్చి వెంకటశాస్త్రి తలుపుకొడితే యెవరూపలకలేదు. వాళ్లు కంగారుపడి మమ్మల్ని లేపేరు. నేను వూళ్లో యింకో నలుగురును కేకేసి తలుపుకొట్టేను. జవాబులేదు. తలుపు బద్దలుకొట్టేము. ఏం చెప్పను— యిప్పటికీ ఆ భయానకదృశ్యం నాకళ్లకు కట్టినట్టు ఉన్నది.

ఇంటిలో యావన్మందీ చచ్చిపడున్నారు. బలవంతంగా చంపబడ్డారని వారిరక్తసిక్తగాత్రములే సాక్ష్యంయిచ్చినాయి. ఊరిలో యెవరికీ యేచప్పుడూ వినపడలేదు. ఏరోదనం వినపడలేదు. యీ దారుణకృత్యం మానుషమా! అమానుషమా!

వెంకటశాస్త్రి వీరందరికీచేసిన అపకారంయేమిటి! ఈ పైశాచిక కృత్యంవల్ల వీరుసాధించినదీ జయించినదీ యేమిటి! యీ ద్వేషానికి కారణం యేమిటి!

వెంకటశాస్త్రికొడుకు మేనమామగారింటనే ఉండిపోయేడని నేవేరే చెప్పడం యెందుకు. అతని ఇల్లూ, భూములూ, అమ్మి మంచిధర రాబట్టమనీ, అంతవరకూ అమరకం వగైరా నన్నే చూడమనీ వప్పచెప్పేడు. ఇప్పుడు తమకు అమ్మజూపిన భూములు అవి. గ్రామంలో పరిస్థితులివి. మాకుండే చిక్కులేమిటని తమరడుగుతే ఇంతదూరం చెప్పవలసివచ్చింది. ఇంకా ఇటువంటివెన్నో! ఇటువంటి గొడవలు మా ఒక్క గ్రామంలోనే పుట్టలేదు. ప్రతీ గ్రామంలోను కొంచెం యెక్కువగానో తక్కువగానో, ఇటువంటివి ఉంటూనే ఉన్నాయి. అందుచేత మన ఒక్కళ్లమే మంచివాళ్లమనీ, వాళ్లు చెడ్డవాళ్లనీ నా అభిప్రాయంకాదు. అందరినీ యీలా హత్యచేస్తా

రనీకాదు. వాళ్ళందరూకూడా స్వభావంచేతను మంచివాళ్లే, లేనిపోని కలహాలుపెట్టుకోరు. కాని, దేశంలో స్వార్థపరులూ, సంకుచిత మనస్కులూ, వివేకశూన్యులూ, సంస్కారరహితులూ, నాయకత్వం వహించి క్రోధాగ్ని ప్రజ్వలింపజేయడమే ప్రధానకార్యంగా పెట్టుకున్నప్పుడు ఇటువంటి దురంతాలు జరక్కమానవు. అడవిలోపుట్టిన అగ్నిహోత్రంవలె ఒకగాలికి వ్యాపించి క్రమేణా దానంతటదే చల్లారక మానదు.

అందుచేత తమరు తప్పక ఈ భూములు కొనవలెననే నా అభిప్రాయం. తమబోంట్లు కొంతమంది ఇలా గ్రామాల్లో స్థిర నివాసం యేర్పాటు చేసుకుంటే మాకూ గ్రామానికీకూడా శుభదాయకంగా వుంటుంది. ఇంక మనం ఒకసారివెళ్లి ఆ భూములు చూచొద్దాం రండి.

ఏమే, మేంవీధిలోకి వెడుతున్నాం గాని, త్వరగా టీ తీసుకురా:........."

# తుది పలుకు

ఈ పుస్తకములో మీరు చదివిన కథలన్నీ చాలాకాలం క్రితమే 'భారతి', 'ప్రతిభ', 'ఆంధ్రశిల్పి' పత్రికలద్వారా ఆంధ్రరసికలోకాన్ని దర్శించి, వారి మన్ననలను పొంది నాయి. ఆఖరు కథమట్టుకు దరిమిలాను వ్రాసినది.

ఈ కథలెందుకు వ్రాశావంటే చెప్పడం చాలా కష్టం. కథలు, మనకు ఈనాడు పుట్టినవికావు. ఆంగ్లేయ సాహిత్యాన్నుంచికాని, మరే పాశ్చాత్య సాహిత్యాన్నుంచికాని ఎరువు తెచ్చుకొన్న అలంకారమూ కాదు. అనాదినుంచీ మనకు వస్తున్న సాహిత్యవిశేషమే ఇది. వేదములలో పుట్టి, ప్రభువలె మన ధర్మాలను శాసిస్తూ, ఉపదేశిస్తూ, ఉపనిషత్తులలో పెరిగి, మిత్రునివలె ఆదేశిస్తూ, సలహాలనిస్తూ, పురాణేతిహాసములద్వారా జనసామాన్యానికి దగ్గరకువచ్చి, ప్రియకాంతలా జీవితరహస్యాలను, నగ్నంగానూ వ్యంగ్యంగానూ కనపరచి, సత్యాన్వేషణకూ, ధర్మచింతకూ పురికొల్పుతూ ఉండేది.

ఈ కథారూపం కాలానుగుణ్యంగా మారుతూవచ్చింది. దానితోపాటు కథావస్తువుకూడా మారడం సహజమే. నాటి ప్రజాజీవితానికీ నేటి ప్రజాజీవితానికీ ఎంతో తేడావుంది. ఈనాటి సుఖాలూ, దుఃఖాలూ, సమస్యలూ వేరు — అవి ఈనాటివే. రేపివి మళ్ళీ మారవచ్చు. సాహిత్యానికి జీవితాన్ని ప్రతిచింబించడంకూడా ఒక ముఖ్యప్రయోజనమైతే, ఈనాటి కథాసాహిత్యం - కవిత్వంమాట ఎలావున్నా - తప్పక ఈనాటి జీవితాన్ని ప్రదర్శించక తప్పదు. దాని కవసరమైన రూపం, రీతి, కథకుని ప్రత్యేకత.

సంసారం, మహాసముద్రమనీ అది దుఃఖ భూయిష్టమనీ మనం పుట్టినప్పటి నుంచీ, పెద్దలవల్ల వింటూనే ఉన్నాం. కాని ఎంతదుఃఖమయమో, ఎందుకు దుఃఖమయమో ఎవరికి వారు అనుభవించేవరకూ తెలియదు. ఈకాలంలో, ప్రతిమనిషి జీవితం, అదినుంచి అంతము వరకూ, ఏదో కారణంచేతను, ఏదోరకమైన కష్టాలతోటీ, నష్టాలతోటే గడుస్తోంది కాని సంతోషంగా నూటికో కోటికో ఏ ఒకరికోకాని, గడవడంలేదు. అన్నిటికి మల్లేనే దానికీ ఏదో కారణం ఉండి ఉంటుంది. అది చాలా వరకు మానవ కల్పితమై ఉంటుంది. ఆకారణం చేత, దానినివారణోపాయం కూడా మానవుల చేతులోనే ఉంటుంది. ఎవరి జీవితం తీసుకుని పరిశీలించినా దాని యాదార్థ్యం తెలుస్తుంది. అటువంటి సంఘటనలు, తనుకన్నవో విన్నవో, ఆధారంచేసుకుని, కథ వ్రాసి, మానవుల మానసిక ప్రవృత్తులను చక్కగా చిత్రించి ప్రజలకు ప్రదర్శించటం కథకుని లక్ష్యం

జీవితంలో ప్రతి ముఖ్యఘట్టంలోనూ దూరాలోచనా, సక్రమమైన తీర్మానం, ఉంటే అనేక కష్టాలూ దుఃఖాలూనివారించుకోవచ్చు.

పిల్లనిచ్చుకునే టప్పుడు డబ్బొక్కటే కాదు ప్రధానం పిల్ల డబ్బుతో బ్రతకదు. మనుష్యులతో మనుష్యులమధ్యనుండాలి. అందుచేత వారి గుణస్వభావాలూ అభిరుచులూ తెలుసుకోడం ప్రధానకర్తవ్యం కదా. అలా జరిగి ఉంటే పద్మజీవితం విషాదాంత మెందుకవుతుంది. అలాగే, ధనమదాంధతచేత, అధికార ప్రాపకంచేత, కళ్ళుమూసుకుపోయి, విషయవాంఛలేకాని ఆధ్యాత్మికచింత నెరుగకపోవడం చేత పార్థసారధినాయుడు జీవితంలోచేసిన ఘోరుణాలు సామాన్యుడు సాధారణంగా చెయ్యగలడా.

న్యాయానికి, నలుపూ, తెలుపూ, బీదా ధనిక వ్యత్యాసా లుంటాయని మనం అనుకుంటామా! అలా ఉంటే మనం బ్రతక గలమా! కుప్పడు బ్రతకగలిగాడా! కాని అటువంటి అన్యాయాలు ఎన్ని మనం కళ్ళారా చూడటంలేదు! అందు చేత నీ న్యాయ సూత్రాలు మారాలా అక్కరలేదా!

మన సుఖదుఃఖాలకు మూలకారణం మరొకటి-ధనం-దాని కున్న ప్రాబల్యం, అధికారం, వశీకరణం, సమ్మోహనం మరిదేనికీలేదు. ముఖ్యంగా ఈ నాడు, సృష్టికంతనూ అధిష్టానదేవతగా ఉన్నది. దానివలన కలుగుతున్న అనర్థాలూ, అరిష్టాలూ, కోటానకోట్లు ఉదాహరణకు జగన్నాధ రథం.

ఇంతకన్నా ప్రబలమైన దింకొక కారణం దరిమిలా బయలుదేరి, లక్షలాది వైరాలకూ, ద్వేషాలకూ, విషాదాలకూ దారితీస్తున్నది. అదికులద్వేషం మతద్వేషం.

మతం మానవుడు బాగుపడి ఉన్నతస్థితికి రావడానికి పుట్టబడ్డది. అది వాని అధఃపతనానికి కారణం కావచ్చునా! వానిలో అణగిఉన్న ఆధ్యాత్మిక చింతనీ శక్తినీ పైకి తీసుకువచ్చి పరమేశ్వరుని సన్నిధికి తీసుకుపోవలసినది. వానిలోఉన్న పశుత్వాన్నీ రాక్షసత్వాన్నీ పైకితీసుకువచ్చి, మానవుని అడవిజంతువుకన్నా అధ్వాన్నంచేస్తూన్న మతం ఏమి మతం.

అలాటిదే కులద్వేషం—ఏనాడో, ఏ ఉద్దేశంతోనో బయలు దేరిన సాంఘికాచారాలకు విపరీతార్థాలు కల్పించి, స్వలాభం కోసం ద్వేషాలూ, వైరాలూ పెంచుతే వాటివల్ల విషాదాలు ఎన్నైనా రావచ్చును.

ఇవన్నీ మానవకల్పితములూ కృత్రిమములూ అని మనం ఒప్పుకోకతప్పదు. అందుచేత నివన్నీ లేకుండాకూడా చేసుకునేశక్తి మనకున్నదన్నమాటే కాదూ!

# మొక్కపాటివారి ప్రచురణలు



| | |
|---|---|
| బారిష్టరు పార్వతీశం | 1-4-0 |
| ప్రొఖక్కబడి (నాటకలు) | 2-0-0 |
| కన్నవీ—విన్నవీ (మొదటిభాగం) | 1-8-0 |



ప్రతులకు:

## మొక్కపాటివారు

అడ్మిరాలిటీ హవుస్,

మైలాపూరు :: మదరాసు — 4.